శ్రీ ర స్తు.

శ్రీమతే రామానుజాయనమః.



# ముముక్షు జనకల్పకము.

ఇది

చెన్నపట్టణము.

ప్రాతచాకలపేటయందుండు

పమ్మి - త్యాగరాయసెట్టిగారిచే

స్వకీయ

శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రితమై ప్రకటింపఁ బడినది.

౧౯౧౩ సం.



---

# ప్రకటన.

## గురుశిష్యసంవాద - వైద్యచింతామణి.

ఇందు నవనాథ సిద్ధక్రియలు, ద్రవ్యశుద్ధి, రసయోగ కషాయంబులు తైల లేహ్య ఘృత చూర్ణంబులు, నస్య ధూపిత భేషజ్య క్రమంబులు, మొదలగు సారతమాంశంబులు విపులంబుగ విశదీకరింపఁ బడియున్నది. ఈయొక గ్రంథముచేతనే సకల వైద్య విషయము లెరుంగగలరు

| | రూ. | | |
|---|---|---|---|
| గురుశిష్యసంవాద - వైద్యచింతామణి | ౧ | ౧౨ | ౦ |
| వేదాంతరత్నాకరము ఆంధ్రతాత్పర్యసహితము | ౦ | ౮ | ౦ |
| లలితాసహస్రనామస్తోత్రము | ౦ | [illegible] | ౦ |
| శ్రీరుద్రాధ్యాయము స్వరము టీకాసహితము | ౧ | ౪ | ౦ |
| మంత్రపుష్పము ఆంధ్రటీకా సహితము | ౦ | ౬ | ౦ |
| శ్రీ స్తోత్రరత్న పంచకము ఆంధ్రతాత్పర్యసహితము | ౦ | ౮ | ౦ |
| సుందరకాండము, తాత్పర్యసహితము | ౧ | ౦ | ౦ |
| డిటో మూలము | ౦ | ౧౦ | ౦ |
| భగవద్గీతలు, ఆంధ్రతాత్పర్య సహితము | ౦ | ౧౪ | ౦ |
| డిటో మూలము, సుందరమగు చిన్నసైజుది | ౦ | ౪ | ౦ |
| …చరిత్రము - పటీకము కాలికోబైండు | ౧ | ౮ | ౦ |
| విష్ణుసహస్రనామస్తోత్రము, నామావళీసహితము | ౦ | ౮ | ౦ |
| బృహజ్జాతకము టీకాసహితము | ౦ | ౧౦ | ౦ |
| జ్యోతిషార్ణవ నవనీతము ఆంధ్ర తాత్పర్యసహితము | ౨ | ౦ | ౦ |
| యాజ్ఞవల్క్యస్మృతి విజ్ఞానేశ్వరీయ యుక్తము | ౨ | ౮ | ౦ |
| దక్షిణామూర్తి స్తోత్రము టీకాసహితము | ౦ | ౪ | ౦ |
| శ్రీమద్రామాయణ సారసంగ్రహము తాత్పర్యసహితము | ౦ | ౮ | ౦ |
| శ్రీమద్రామానుజ చరిత్రము | ౧ | ౦ | ౦ |
| యల్లాజీయము, ఆంధ్ర తాత్పర్యసహితము | ౨ | ౦ | ౦ |
| డిటో మూలము | ౧ | ౦ | ౦ |




పమ్మి - త్యాగరాయసెట్టి.
ప్రాతచాకలపేట. మద్రాసు



శ్రీమతే రామానుజాయనమః.



# ము ము క్షు జ న క ల్ప క ము.

## ప్రథమ ప్రకరణము.

శ్లో॥ శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్।
యతీన్ద్రప్రవణం వన్దే రమ్యజామాతరం మునిమ్॥
శ్లో॥ శ్రీమద్యతీన్ద్ర ప్రవణ ప్రవణ స్వీకృత స్థితమ్।
అర్థపంచక తత్వజ్ఞమాచ్చి రామానుజం భజే॥

### సీసపద్యములు.

అఖిల వేదాంతరహస్య ప్రవర్తకాచార్య పరంపరా జన్మభూమి । చేత
నాచేతనశేషి పరవ్యూహ విభవాంతరాత్మార్చ వేషధారి । స్వేచ్ఛాగృహీ
తనిజేష్ట విగ్రహయోగి నిఖిలహేయ ప్రత్యనీకమూర్తి । భోగలీలార్థవిభూతి
ద్వయేశ్వరుం డఖిల కల్యాణ గుణాకరుండు । అతఁడు ఫణిశాయి గరుడవా
హనుఁడతండు । అతఁడు లక్ష్మీశుఁడానంద మతఁడుదాసె । యతఁడు కారణ
కార్యాంతరాత్మయొకఁడె । ధ్యేయుఁడనిచెప్పె లక్ష్మణదేశికుండు॥ ౧

తాత్పర్యము॥ సమస్త వేదాంతములచేతఁ బలుకఁ బడిన రహస్యము తిరుమంత్రము - ఆ తిరుమంత్రము శ్రియఃపతితానే - గురు పరంపరకు నుపదేశించిన మొదటి యాచార్యుఁ డనియును - చేతనాచేతనములకు నేలిన వాఁడనియును - బరమపద - క్షీరాబ్ధి - రామ - కృష్ణాద్యవతారాంతర్యామ్యర్చావతారమను - నీయైదు స్థలములయందు వేంచేసి యుండునని యును - దనయిష్టమైన తిరుమేను ధరించఁ గలవాఁడనియును - సకలాత్మలయందు నంతర్యామియై యుండుననియును - దుఃఖములఁ బాపయనివాఁడనియును నిత్యవిభూతి లీలావిభూతులు రెంటికిని నాథుండనియును సమస్తకల్యాణగుణగణసాగరుఁడనియును - శేషశాయి యనియును గరుడుఁడు వాహనముగాఁ గలవాఁడనియును - సహానందమయుఁడనియును గారణ కార్యాద్వయంబైన కంతర్యామినైయుండు ననియును దారక పోషకాదులకు నతఁడె కర్తయని

లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ ( పర్వతత్వనిర్ణయము శ్రియఃపతియని యానతిచ్చి దారక పోషకాదులకుఁ గర్తయైన దైవము తిరుమంత్రరూపముగా నుండెడు ననికిమీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ చిదచిదీశ్వర సంజ్ఞఁ జేతనాచేతన శ్రీవల్లభాత్మక సిద్ధనిఖిలు । జగద్దైక్యభేదలక్షణ వాక్య వేదాంత సంగ్రహోష్టాతుర సదుపదేష్ట । భావ విశ్రుతలోక పావనాచార్య విశేషాభిమాన సంక్షీణవివిధ । పూర్వోత్తరానంత పుణ్యపాపాత్మకకర్మ భాగవతాగ్రగణ్యసుజన । దర్శనస్పర్శనోక్తి ప్రధానపుణ్య । పాదసంచారవిద్యా ప్రభావములనె । చెప్పుచుండును జేతనోజ్జీవనైక । పరుఁడు లక్ష్మణముని తను పరమ కృపను॥ ౨

తా॥ శరీరము ఆత్మ పరమాత్మ యీమూఁటిచేత శ్రియఃపతి దేహమైనదనియు- చేతనమున చేతనము నేకమైయుండుననియును భేదమై యుండుననియును వేదాంతరహస్యమైన తిరుమంత్ర ముపదేశించుచున్న వాఁడనియును ఆ మంత్రమందలి భేదవాద మెఱింగిన యాచార్యులు లోక పావనులనియును అటువలె నాచార్యాభి మానమందుండిన చేతనునికి బహువిధములై పుణ్య పాపరూపములైన కర్మములు చెడుననియును అతఁడు భాగవతులలో మున్నెన్నఁ దగినవాఁడనియును ఆ యుత్తమ పురుషుఁడు వీక్షించిన దిక్కున శ్రీహసస్పర్శ శ్రీపాదస్పర్శచేసిన దిక్కున వారి జ్ఞాన ప్రకాశముచేత నాయా దిక్కులనున్న యాత్మలు ముక్తులౌదురనియును చేతన సంరక్షణార్థముగా నవతరించిన రామానుజులీ యర్థ మెఱిఁగి బ్రతుకుండని యానతిచ్చిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఆ తిరుమంత్ర మాచార్యాధీనము గనుక యాచార్యాభిమాన ప్రభావ మానతిచ్చి యన్యులలోడి సహవాసము కారాదని మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ భ్రమచేత విప్రలంభముచేత నలసతచేతఁ బ్రమోదంబు చేతనైన । భావదుష్ట ప్రోక్త బౌద్ధపాశుపతాది వేదబాహ్యకుదృష్టి విమతకృతుల । నాసురప్రకృతి మోహనకల్పితములని తాత్వికులందు నాదరముమాని । శ్రుతి నిత్యమునఁ బౌరుషోక్తియునని తత్వహిత పురుషార్థంబు లెఱుఁగుచోటఁ । దదుపబృంహణ రూపప్రధానభార । తాదిసాత్వికసత్పురాణాదిపాంచ । రాత్ర సంస్కృత వేదాంతసూత్రసమ్మ । తార్థ మెఱిఁగింతురని లక్ష్మణార్యులనిరి॥ ౩

తా॥ భ్రమచేతను సంవాదముచేతను నాక్షకృతిఁ జేసి వేసటపడి విడుచుట చేతను ప్రమాదవశముచేతను మనసు చలింపఁ జేసిన బౌద్ధపాశుపత కపిల

మాయావాది మతములను వేదాంతార్థముల నెఱుఁగనీక వేదబాహ్యార్థముల నిశ్చయించి కృతులఁ జేసియుండునవియును అవిరాక్షస ప్రకృతులకు రాజస తామసాది మోహములు పుట్టునట్లు శ్రియఃపతి యాజ్ఞవలనఁ జేయించిన వనియును తత్త్వజ్ఞులైన పెద్దలయందలి విశ్వాసములు విడిచి వేదము నిత్యము ఒకరిచేతఁ బలికించఁ బడక తానే పలుకుచున్నదనియును ఆత్మకు హితమైన తత్త్వమునుఁ దెలియవలసిన పెద్ద లావేదాంతార్థము వివరించెడి శ్రీమద్రామాయణమ్మును శ్రీ మహాభారతమును శ్రీపాంచరాత్రమును నిందుల నిశ్చయించిన వేదాంత రహస్యార్థమును నెఱుఁగింతురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (తామసరాజసములుగల రాక్షస ప్రభృతులకు భ్రమకలుగఁ జేసిన వేదబాహ్యార్థములును వారి సహవాసములును కారాదని యానతిచ్చి యా వేదాంతార్థ మెఱుఁగునట్టివి మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ అవనిలో వేదవేదాంతేతిహాసాదులా ద్రావిడామ్నాయ మరసియందె । కనిఁ బర్ణ కారణాకార వాచ్యుఁడెవరుం డతఁడాది నారాయణాహ్వయుండు । అతనికిఁ బరతంత్రు లఖిలాత్మలును బద్ధముక్త నిత్యాత్మలు మొదటనుండి । బద్ధులాతనిఁ జేరభక్తి ప్రపత్తులు సాధనంబులు సదాచార్య కృపయు । సాధ్యమీశ్వరదాస్యంబు సహజమతని । దాసపర్యంతమైయుండుఁ దద్విరోధి । దేహమందాత్మ బుద్ధియు దేహబంధు । వందుమమతయ్యునని లక్ష్మణార్యులనిరి॥ ౪

తా॥ భూమిలోఁబుట్టి వేద వేదాంతరహస్యము నెఱుఁగవలెనన్నఁగా నితిహాసాదులలో శ్రేష్ఠమైన శ్రీ మద్రామాయణ భారత ద్రావిడ వేదము నివి చదివి వినినందుచేత సర్వమైన యక్షరములకుఁ దలకట్టయి యకారవాచ్యుండైన శ్రియఃపతి యనియును అతం డాదినారాయణుండను తిరునామముగలవాఁడనియు సర్వమైన యాత్మకోటులతనికిఁ బరతంత్రులనియును ఆ యాత్మలలో బద్ధులనియు ముక్తులనియు నిత్యులనియుఁ జెప్పఁబడిన యాత్మల లోబద్ధులాతనిం జేరుటకొఱకు కర్మజ్ఞాన ప్రపత్తులు సాధనముగాఁజేసియు నందు కధికారము చాలకుండుటం జేసి సదాచార్య కృపసాధనముగాఁ జేసికొని శ్రియఃపతి దాస్యము సహజముగాఁజేసియు నతనిదాస్యమునకు విరోధమైనతలంపు దేహము ఆదేహమే యాత్మయనియును దేహసంబంధులు తనవారనియును నీరెండును విరోధములని లక్ష్మణార్యులనిరి॥ (దాస్యానకువిరోధము లైన తలంపులానతిచ్చి వేదాంత తాత్పర్యముగాక వేదబాహ్యములైన యాగ

మములకు లోనుగాక యవి విడువవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ ఐతిహ్యసంభవార్థాపత్త్యభావోపమానానుమానాగమములు వి
డిచి । ప్రత్యక్షమొకటిపట్టి కొందఱు సెప్పఁ గొందఱు మఱికొన్నిఁగూర్చి చె
ప్పఁ । దత్త్వంబు వేదాంతతాత్పర్యసిద్ధమై మనకబ్బునవి యాగమం బెపట్టి। ఘ
నుఁబు వేదాంత సంగ్రహమంత్ర మూలప్రమాణైకనిష్ఠులై మహానకార ।
వాచ్యుఁ డాశ్రీశ్వరుండని వానిదాస్య । మధికఫలమని తదుపాయమతని
కరుణ । యనుచుఁ దమయత్నములుమాని యతనినమ్మి । యుండవలెననెల
క్ష్మణయోగివరుఁడు॥ ౫

తా॥ వేదాంతములచేతఁ బుట్టిన రహస్యార్థమును దబ్బర సేయవలసిన యుపమానములవలనను అనుమానములవలనను గల్పించిన యాగమములను విడిచి సూర్యదేవుండును నగ్నిదేవుండును వాయుదేవుండును వీరు మొదలైన దేవతలును బ్రత్యక్షముగాఁ బరతత్త్వమని చెప్పుదురు అదిమనస్సునఁ బెట్టక పెద్దలు వేదాంత తాత్పర్యమైన మంత్రమును బరతత్త్వమని చెప్పునట్టి యాగమములే మనకుఁ గావలసిన వనియు అది మనస్సునఁ బెట్టి మూలమంత్ర ప్రమాణముచేత నిష్ఠపరులై యకారవాచ్యుండైన శ్రియఃపతియనియు నతనికైంకర్య మధికఫలమనియు అతని కైంకర్యమునకు హేతువతని కరుణయనియును పదైశ్యముచేత నెఱింగి తమయత్నములుమానీ సర్వంబునకును అతని నమ్మి నిర్భరులై యుందురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( శ్రియఃపతి కృపచేత శరణాగతులైన వారికిఁ దమయత్నములు మానుమని యానతిచ్చి వేదములు రెండర్థములని నిశ్చయించి యందు సాధారణమనియు నసాధారణమనియు మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ భాగద్వయాత్మక బహువేదములచేత వేద్యుఁడొక్కఁడు వాఁడు విష్ణు
శబ్ద । వాచ్యుఁడై యఖిలదేవతలకంతర్యామియై యుంటఁ జేసి యజ్ఞాదిక
ర్మ । గతిఁ జెప్పుపూర్వభాగము తదారాధనప్రతిపాదకంబవ్యభాగమతని । రూ
ఢభూత్యాత్మ స్వరూపవిగ్రహగుణప్రఖ్యాతిఁ జేయుచుఁ బరమభోగ్య । వితత
మైయుండు వారాధ్య వేషమనుచుఁ । బలుకునదియును దత్ప్రతిపాదకంబ । య
నియుసాధారణాకారమందె తగిలి। యుండవలెననె లక్ష్మణయోగివరుఁడు॥ ౬

తా॥ వేదములు రెండు విభాగములై రెండర్థములై శ్రియఃపతిని నొకఁడని చెప్పునవియు పూర్వభాగము సకల దేవతాంతర్యామిత్వముచెప్పి యందుకుఁదగిన యజ్ఞాదికర్మములం జెప్పుచున్నదనియు నుత్తరభాగము దివ్యమం

ఖిలవిగ్రహుండై యనంత కల్యాణ గుణాకరుండై చెప్పఁ బడియున్న శ్రియః పతియొక్క నిజరూపమైన శరీరమును జెప్పుచున్న దనియు ఆకర్మ ప్రతిపాద్యమైనసాధారణస్వరూపముల విడిచి యసాధారణమైన యకారమంద తగిలి యుండవలెననిలక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( వేదపూర్వ భాగోత్తర భాగములు రెంటిలో నుత్తరభాగము సిద్ధమని యానతిచ్చి పరతత్వము నిర్ణయించెడి వేదము బహువిధములుగా జెప్పినను భ్రమయవలదని మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ తత్వహిత ప్రవర్తకమైన వేదంబు బహుభంగిఁ జెప్పిన భ్రమయకండు । శాస్త్రవిశ్వాస సంజనకముల్ పస్యన్నవ్యభిచారాది విహిత విధులు । ఆత్మ నిత్యత్వాదులరయుటకై స్వర్గ సాధనయజ్ఞాది సకలవిధులు । అత్యనల్ప మోక్షాదిఫలప్రద బ్రహ్మవిద్యలు శేషభావ మెఱుఁగ । నాత్మ పరతంత్రుఁ డనభరన్యాసవిధులు । ననుచుఁ దెలిసినవారికి నాత్మనాథు । కరణసాధనమత దంఘ్రి కమలయుగము। సాధ్యమనిచెప్పె లక్ష్మణాచార్యవరుఁడు॥ ౨

తా॥ వేదాంత తాత్పర్యమైన తత్వము నిశ్చయించి బహువిధములుగాఁ జెప్పిన భ్రమనుమాని యుండవలెననియును శాస్త్రములు విచారించిన ఫలసాధనములుచూపి యజ్ఞాదులు సేయించి యాఫలములు తీరిన పిదపఁ బుట్టువులు చేసును గనుక వ్యభిచార లక్షణములు గలిగియున్న యా శాస్త్రములు వనితియు నాత్మ నిత్యుఁడని తెలియని బద్ధులకుఁ దెలియునటుల యజ్ఞాదులైనకర్ములఁ గల్పించి స్వర్గఫలమును గలుగఁ జేసుననియు ఎన్నటికిఁ జేటులేనిదియు నైయధికములో నధికమును నైన మోక్షము నిచ్చెడు పరతత్వజ్ఞానములోఁ గూడిన యాత్మ నెఱుంగ వలెననియు వేదాంతముచేత నీ యాత్మ పరతంత్రుఁడైనది తెలిసి నిర్భరులై యుండెడివారికి శ్రియఃపతి కరుణ ఫలమై యుండుననియు అతని చరణము లితనికి నుపాయ మనియు లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( వేదాంతశాస్త్రములు భ్రమయఁజెప్పిన యాభ్రమలు విడిచి వేదాంత తత్వమును నానతిచ్చి యిట్టి శ్రియఃపతిని వేదములు బహువిధ నామములచేతఁ జెప్పుచున్నదనిమీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ సత్యాదిలక్షణ సద్బ్రహ్మశంబుపరంజ్యోతి రింద్రహిరణ్యగర్భ । శబ్దాదివిశ్రుతసాధారణాకార వరజగత్కారణ వస్తువిషయ । చింతాభిధేయవిశేష భాస్వద్విష్ణు పురుషోత్తమాచ్యుత పుండరీక । నయననారాయణ నాథలక్ష్మీశ్వర వాసుదేవేత్యాది వాచ్యుఁడొకని । నఖిల వేదపురాణేతిహాససూత్ర । పాంచరాత్రాదిది శాస్త్రసంభావ్యుఁ డనుచు । వైదికోత్తములెల్ల

నీవసుధలోనఁ గొలుతురని చెప్పె లక్ష్మణగురువరుండు॥ ౮

తా॥ సత్యములైన వేదములు శ్రియఃపతిని బ్రహ్మయనియు. రుద్రుఁడని యుఁ బరంజ్యోతియనియు నింద్రుఁడనియుఁ జతుర్ముఖుఁడనియు వీరు మొద లైనదేవతల నామములచేత సాధారణమై బహువిధములైన నామధేయము లు గలిగియుందురనియు అవి విడిచి సర్వజగత్తులకుఁ గారణమైన వస్తువు స ర్వాత్మల యందుండి తన్నుఁగావలసి ధ్యానంబుచేయఁ బ్రకాశించెడి విష్ణు వనియుఁ బురుషోత్తముఁడనియు నచ్యుతుఁ డనియుఁ బుండరీకాక్షుఁ డనియు నారాయణుఁడనియు నాథుఁడనియు లక్ష్మీశ్వరుఁ డనియు వాసుదేవుఁడని యు నిట్టి యసాధారణ తిరు నామములుగలవానినొక్కనిఁ నట్టి సమస్త వేదాం తేతిహాసాది పురాణాదులును శ్రీ పాంచరాత్రమును నెవ్వనిం జెప్పునో యతఁడే విశ్వయమైన పరతత్వమని పెద్దలు సేవింతురని లక్ష్మణార్యులానతి చ్చిరి॥ (వేదాంతములచేత శ్రియఃపతి నానావిధ నామధేయములు గలవాఁ డని యానతిచ్చి వేదాంతముల చేత సర్వేశ్వరుని వైభవ మెఱింగి యావే దశాస్త్ర పురాణేతిహాస ద్రావిడాగమములును నెవ్వనిం జెప్పు ననఁగా మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ। అఖిల వేదాంతంబు లానంద నిర్భర పరమ కారణ పరబ్రహ్మఁ జె ప్పుఁ। బాంచరాత్రము సృష్టిపాలన సంహారయుక్త త్రియుగగుణ వ్యూ హపరము। రామాయణాదులు రామకృష్ణ ప్రభృత్యవతార వైభవాఖ్యా నకములు। స్మృతులుదర్మంబులు సెప్పుచు నింద్రాది దేవతాంతర్యామి సేవఁదెలుపు। ద్రావిడామ్నాయ మర్చావతార పరము। వేద్యసర్వేశ్వ రుఁడు పంచవిధములైన। వేదకంబైన వేదమీవిధములయ్యె। ననుచు లక్ష్మణ మునివరుం డానతిచ్చు॥ ౯

తా॥ సమస్త వేదాంతములును జ్ఞానానంద నిర్భరుండైన పరమకారణ పరబ్రహ్మమైన పరవాసుదేవునిం జెప్పుననియు పాంచరాత్రము సృష్టిస్థితిసం హారముల నిమిత్తమై త్రియుగగుణములతోఁగూడి సంకర్షణానిరుద్ధ ప్రద్యు మ్నవ్యూహమును జెప్పుననియు శ్రీరామాయణము భాగవతము ఆయాయ వతారముల వైభవములను గుణవిశేషములను జెప్పుననియు స్మృతులుయజ్ఞా దికర్మములఁ జెప్పుచును సకలదేవతాంతర్యామి సేవఁజెప్పుననియు ద్రావిడ వేదమర్చావతారములఁ జెప్పుననియు వేదకమైన వేదమును నయిదువిధము లైయయిదుస్వరూపముల విగ్రహములను జెప్పినిర్ణయించెననిలక్ష్మణార్యులా

నతిచ్చిరి॥ (ఆ శ్రియఃపతి పంచస్థలములానతిచ్చి యిట్టి వేదాంతమును నిశ్చయిం చి యనుభవించెడివిధము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ వేదార్థమెఱిఁగెడి విధము పురాణేతిహాసాదితదుప బృంహణము లరసి। ప్రబలంబులందులో భారత రామాయణాఖ్యేతి హాసంబులందుఁ జెప్పఁ। జెరమండియును సీత సేవ దౌత్యముఁ జేయు పురుష కారోపాయ ఘాతమిథున। వైభవం బెఱిఁగిన వారన్యములునూని తదుప బృంహణద్వ యార్థనిష్ఠఁ। దగిలియుందురు వారల దాసులగుచు। నొదిగియుండెడివారి కినొకభయంబు। లేదు యతిపతిఁ జేరుఁడి వాదముడిగి। యనుచు లక్ష్మణముని వరుండానతిచ్చు॥ ౧౦

తా॥ వేదాంత తాత్పర్యము నిశ్చయించెడివిధము వేదశాస్త్రపురాణేతిహాసాదుల చేతను, నితిహాసాదుల చేతను ఆయితిహాసాదులలో శ్రేష్ఠముగా నెంచఁబడిన యర్థములు రెండుగలవు శ్రీమద్రామాయణమును భారతమును నీ రెంటిలో రామాయణమున చెరనుండిన సీతాదేవి వైభవము చెప్పెననియు భారతమందు దూతసారథ్యములు చేసిన యాతని వైభవము చెప్పెననియు ఈయిద్దరి వైభవములు పురుషకారము ఉపాయము చెప్పెననియు ఈ రెండును గూడఁగా మిథునమాయెననియుఁ జెప్పుచున్నది అట్టి వైభవమెఱిఁగిన పెద్దలన్యములు మాని యాయర్థమును నిశ్చయించిన రామాయణ భారతములయందుఁ గలిగిన యర్థమనుష్ఠించినవారి యెడ దాసదాసులై యొదిగియుండెడి వారికి నొక భయమును లేదు పెకు వాదములుడిగి యెంబెరుమానారు సంబంధమెఱింగి బ్రదుకుండని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (వేదశాస్త్ర పురాణేతిహాసాదుల చేతఁ బరతత్వ మానతిచ్చి సిద్ధోపాయనిర్ణయముగా శ్రియఃపతిని జెప్పుచును నన్యులకు శీఘ్రమే సంబంధము గలిగెనని మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ వేదశాస్త్ర విచార విజ్ఞాత తత్వంబు చిదచిద్విశిష్టలక్ష్మీశ్వరుండు। కమలాద్యుపాయ సౌకర్యాదినిశ్చితహిత ప్రపత్తియె యిందరికిని। భోగ్యభూతాఖిలపురుషార్థములలోన మిథునకైంకర్యమె మించియుండు। నధికారిజన్మాద్యహంకారములులేని భజనీయహరిదయా పాత్రనరుండె। కాలములకెల్ల మంచిదికలియుగంబు। ఆశ్రయించంగ వార్థకమైనఁగూడఁ। సులభమైయుండ నేటికి చేరరు నరులు। తెలియరాదనె లక్ష్మణదేశికుండు॥ ౧౧

తా॥ వేదశాస్త్రపురాణేతిహాసాదు లాద్యంతములు విచారించఁగాఁ

జిత్తుకు నచిత్తుకుఁగర్తనైన శ్రియఃపతియొక్కఁడే. కాని పరతత్త్వము నెఱిఁగితే దనినిశ్చయించునదియు ఈచేతనునికి సులభముగఁ జేరునుపాయము కర్మజ్ఞానభక్తిప్రపత్తులలో సర్వాత్మలకు శ్రియఃపతి చరణములఁ జేరుటకుహితమైనద్వయము దప్ప మఱి యుపాయములేదనియు సమస్తభూతకోట్లకును బురుషార్థము శ్రియఃపతియనియు పెరాట్టినిగూడిన యేకస్త్రైత్రిశక్త్యనుసారముగాఁజేసిన కైంకర్యములధిక పురుషార్థమనియును తెలియన వికారాదని చెప్పెడు నధికారి యెట్టివాఁడనఁగా జన్మనిరూపణమును సహంకారము లేనిమనుష్యుఁడు సర్వేశ్వరుని కృపకుఁ బాత్రుఁడని చెప్పునది కాలములలోఁ గలికాలము వర్ణాశ్రమధర్మములొకటిగాఁ గూర్చినడుచుచున్నది గాన నా వేదాంతరహస్యములు సర్వజనులకునొకటే ఫలమునునిచ్చును గనుక కలియుగము మంచిదని చెప్పునది ఆకలియుగమున వార్థకమైన సంబంధముగలిగనేని ప్రాప్యభూమిఁజేరునని చెప్పునది ఆచార్య సంబంధమిటువలె సులభమైయుండఁగా నీసంబంధము నరులెఱింగియు నేలచూరరో తెలియరాదని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (వేదాంతతాత్పర్యము నిర్ణయముగా సంబంధఫలమానతిచ్చివర్ణాదులయిన జాతులకు హెచ్చుతక్కువలు లేవా యనగాఁ దాస్యమునకు రెండు సమమని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ బ్రాహ్మణ్య మధికమై పరఁగుట ఋగ్యజుస్సామాది వేదముల్ చ
దువవలసి। వేదాదిబహువిధవిద్యలు చదువుటతత్త్వవిజ్ఞానసద్వర్తనలకుఁ। త
త్త్వవిజ్ఞానసద్వర్తనంబులముక్తి సాధింతురని సర్వసమ్మతంబు। తత్త్వంబు శ్రీ
నిధితద్దాస్యమే వృత్తియని చెప్పుదురు పెద్దలరసిచూచి। యయినపిమ్మట దా
స్యమందధికరించి। దాసులకు దాసుఁడైయుంట తనకు మేలు। గర్వహేతు
వులయ్యవి గలిగినపుడు। మోసమని చెప్పె లక్ష్మణమునివరుండు॥ ౧౨

తా॥ వేదాధ్యయనము బ్రాహ్మణుఁడు చేయుటంజేసి యధికుఁడాయెననియు ఆవేదములు చదువునది పరతత్త్వమైన వస్తువు నెఱుఁగుటకనియు ఆతత్త్వమెఱుఁగుట మోక్షము సాధించుకొనుటకనియు నిర్ణయము సర్వజన సమ్మతమనియు పరతత్త్వము శ్రియఃపతియని యతని దాస్యమే చేతనునికి వృత్తియని తెలిసిన పెద్దలు చెప్పుదురు పిమ్మట దాస్యమునకుఁ జొచ్చి దాసులకు దాసుఁడైయుండుట తనకు లెస్స లేక గర్వహేతువులు గలిగనేని మోసమని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (అటువంటి పరతత్త్వమును నెఱింగి గర్వము దాస్యమునకుఁ గాదని యానతిచ్చి అహంకారముతోఁ గూడిన సంబంధము నివార

ణమగునటుల మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ నాకు నేఁ గర్తనో నా కన్యులో కర్తలాది శబ్దోక్త నాయకుఁడె కాక । యపాశ్రిత్య సతి క్రియాద్య చిదుపాయంబులా ప్రాపకంబులు నమః ప్రాప్తిగాక । యౌపాధికా స్థిరస్వాంగ సంబంధులా బంధువుల యనార్థప రులు గాక । భోగ్యశబ్దాదులా భోగ్యంబులీయాత్మ కాయశబ్దోక్త వాఙ్మ్యం బెగాక । దేహమాయాత్మ యర్థ సందీప్తగాక । శిథిలుఁ డాయాత్మనర వచస్థిరుఁడు గాక । యనుచుఁ దత్త్వార్థ మెఱిఁగిన యప్పుడితండు। మూర్తుఁడౌ ననె లక్ష్మణమునివరుండు॥ ౧౩

తా॥ నాకు నేఁ గర్తగాను నేనన్యులకుఁ గర్తనుగాను తిరుమంత్ర మందుఁ బ్రణవమునకు మొదటి యక్షరమునఁ బలుకఁబడిన యతఁడె కర్తయని యు మంచిదై దేహవర్ధకమై యుండినను బ్రాప్తము గాక యుండునట్టియు పాయములఁ బొందునది కాదనియు నమః పదమందుఁ బొందునది మంచిదని యు దేహసంబంధులు బాధకులై యస్థిరులైనవారు బంధువులు గారనియు అయనపద మందనుస్వానము గలవారె బంధువులనియుఁ జెప్పనట్టి యీయా త్మకు శబ్దస్పర్శరూపరస గంధములవలన వచ్చినభోగ్యములు కారాదనియు ఆయపదమం దనుస్వానముగల కైంకర్యమె భోగ్యమనియుఁ జెప్పుడు శరీర ముగల్గుఁగ జేసిన యీయాత్మను బ్రకాశింపఁ జేసెననియు ఆయాత్మ నార పదమందుఁ జెప్పఁ బడెననియు మంత్రములోపలి యర్థమిటువలె నిర్ణయము ఱింగియనుష్ఠించిన వారికి మోక్షముకలదని లక్ష్మణార్య లానతిచ్చుచున్నా రు॥ ( యిటువలె మంత్రార్థనిష్ఠపరులై యుండెడు నాత్మలకుఁ గొదువలు లేవని యానతిచ్చి మంత్రార్థ పరుఁడుగాక ఆమంత్రముచ్చరించినను బనికి రాదని మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ తానన్యులకుఁ గాను దనకుఁ దానను గాను ననుమాన మేయని యనన నేల । బ్రతుకు దెరువులు వేలబాపింది వైష్ణవసముఁ డనన్నమనమన్న బ్దమేల । పరుసులభులు మంచిబంధువులను గొన్నన యనర్థార్థంబు లర యనేల । చిత్తంబు విహిత నిషిద్ధవిషయములందుఁ దగిలెనా మఱియు నొం దానదేల । యనుచునీశ్వర పరతంత్రుఁడైనతన్ను । నరసి యాకారముల మాటసమరియుండఁ । దగును మోక్షాధికారికి ధరణిలోన । ననుచు లక్ష్మణ మునివరుం డానతిచ్చు॥ ౧౪

తా॥ తానుదనకన్న వారలకును నను నప్పుడు ప్రణవములోఁ గూడిన మన

స్సు పనికివచ్చునని లేదేని పనికిరాదనియు ఖ్యాతిలాభములు పూజలకొఱకు శ్రీవైష్ణవులకుఁ దాను సమమని తలంచెనేని నమః పదము పనికిరాదనియు పరులను మంచివారలనియు సులభులనియు మంచి బంధువులనియు నెంచెనేని అయన నారపదములు వీనికిఁ బనికిరాదనియు చిత్తము శరీర విషయములం దుఁ దగిలెనేని అకారమునందు - ఆయ పదమునందుఁ బనికిరాదనియు తన్ను శ్రియఃపతికి సర్వావస్థలయందును బరతంత్రునిఁగాఁ దెలియ వలెననియు మూఁడాకారములయం దనుష్ఠానపరుఁడై మోక్షార్థియైనవాఁ డుండునని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( మంత్రమును నర్థమును లెస్సగ నెఱిఁగి యుండవలెనని యానతిచ్చి యీరీతి నధికారికిఁ దత్త్వత్రయ భేదముల నెఱుఁగవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ దేహాత్మ భేదతజ్జీవ పరస్పర భేదజీవేశ్వర భేదములను । దత్తత్స్వ
రూపసంస్థానతర తమభావ తత్తద్విశేష తద్ధర్మములను । స్వస్వరూప ప్రా
ప్తసాధ్య సాధన భావతత్తద్విరోధి సద్భావములను । స్వభ్యస్తశాస్త్ర విచా
రశక్తినైన సద్దేశికోపదేశమునైనఁ । దెలిసి సంసారదుఃఖంబు దీరుకొ
ఱకుఁ । బరమపురుషార్థ మోక్షసంప్రాప్తికొఱకు । వేగయత్నంబు సేయు
వివేకి యపుడె । ముక్తుఁడౌనని లక్ష్మణమునివరుండు॥ ౧౫

తా॥ శరీరమునకు నాత్మకును భేదము కలదనియు నీయాత్మకుఁ దక్కిన యాత్మలకును భేదము కలదనియు నిట్టి యాత్మకును బరమాత్మకును భేదము కలదనియు ఈమూఁడు తత్త్వములయొక్క విరూప స్వభావములను సందుకుఁదగిన విశేషధర్మములను జెప్పి తనస్వరూపము ప్రాప్తమైన ఫలమును సాధించెడు మనస్సుండఁగా నట్టిమనస్సుకు విరోధములైన గుణాదులును అందుకుఁదగిన సహవాసములును చదువులచేతనైన నెఱింగినది లేక చదువులసారమైన రహస్యమూచార్యోపదేశము చేతనైన నెఱింగిన సంసారదుఃఖముపోవుననియు పరమపురుషార్థమైన మోక్షమును బొందుననియు అటుగనుక శీఘ్రముగా నెవరుయత్నము చేతురో వారుమహావివేకులనియును తండప్పుడేముక్తుండౌననియు లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( వేదాంత తాత్పర్యోపదేశముచేత ముక్తుఁడౌనని యానతిచ్చి యీతత్త్వత్రయముచేత నాత్మతత్త్వమేర్పాటుచేసి మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ చిత్తనజీవాత్మ శేషమీశ్వరునకు జ్ఞానస్వరూపితా జ్ఞానగుణకుం ।
డణువు హృద్దిస్థుఁడైయంతయు వ్యాపించు జ్ఞానంబుచేఁ బ్రభేశాదులట్ల । ఛే

దనదహానాద్య శేషక్రియాసర్హుఁడ వ్యక్తుఁడతఁడు నిరవయవుఁడు । క్షేత్రజ్ఞు జీవచిచ్చేతన పురుషాఖ్యుఁ డీశ్వరా చిద్భిన్ను శాశ్వతుఁడు । సర్వదేహం బులందును సముఁడుగాని । నొకఁడుగాఁ డాత్మలవి శేకుల- వికటకర్మ । బద్ధులును ముక్తులును నిత్యపండితులును । ననసనంతములని లక్ష్మణార్యులనిరి॥ ౧౬

తా॥ చిత్తనఁగా జీవాత్మ ఆయాత్మ పరమాత్మకు విశేషమై యుండునని యు జ్ఞాన స్వరూపుఁడనియు జ్ఞాన గుణములు గలవాఁడనియు అణు ప్రమాణ రూపము గలవాఁడనియు హృదయమందుండి దేహమంతయు వ్యాపించుకొని యుండుననియు నెటువలె వ్యాపించు ననఁగా సూర్యుఁడను దీపంబును దివ్యమైన మణియును నొక దిక్కున నుండి దిక్కులను బ్రకాశింపఁ జేసినట్లు శరీరమంతయు వ్యాపించుననియు ఈ యాత్మను నఱికినను గాల్చినను దడిపినను నెండ వేసినను ని క్రియలకులోను గాకయుండుననియు శరీరివలె నవయవములు లేనివాఁడై క్షేత్రమను శరీరమునకుఁ గర్తనై యుండు ననియును సర్వ దేహంబులయందుఁ గదలి మెదలెడి జీవుండై యుండుననియు చిత్తను పేరను చేతనుండై పురుషుని రూపమై యుండుననియు పరమాత్మకును శరీరమునకును వేత్తయై యుండుననియు సర్వకాల సర్వదేశ సర్వావస్థలయందును నిత్యుఁడై యుండుననియు సర్వ దేహంబుల సముఁడై యుండుననియు అందులో నాత్మ యొకఁడు గాఁడు అనేకములు కలవనియు వానిలో బద్ధులనియు ముక్తులనియు నిత్యులనియు ఈ రూపములైన యాత్మలనంతములని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( తత్వ త్రయమును నాత్మతత్వమును నానతిచ్చి యీతత్వములయందుఁ జిత్తైన ప్రకృతి మూఁడువిధములై యుండునని మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ శుద్ధసత్వము సత్య శూన్యంబు త్రిగుణంబు ననన చిత్త్రియ మందురందు మొదలి । శుద్ధసత్వము నిత్య సూరులుండెడి చోటు వాసుదేవజ్ఞాన వర్ధకంబు । అత్యద్భుతము నిత్యమానంద జనకంబు పరిమాణ రహితంబు పరమపదను । భగవదిచ్ఛను గృహాప్రాకార గోపుర ప్రముఖోప కరణమై పరిణమించు । నదియు లక్ష్మీశ్వరుఁడు సుఖ మనుభవించు । భోగసంస్థానమందుండి భువనమరయ । సత్వ శూన్యంబు కాలమచ్చటను నిత్య । మనుచు లక్ష్మణమునివరుం డానతిచ్చు॥ ౧౭

తా॥ అచిత్తనెడి ప్రకృతి తాను శుద్ధసత్వమనియు మిశ్రసత్వమనియు సత్వ శూన్యమనియు మూఁడు విధములయియుండును శుద్ధ సత్వమనఁగా ని

త్యశూరులుండెడుచోటు ఆచోటు శ్రియఃపతి విషయకజ్ఞానమును వృద్ధిఁ బొందించుననియు అత్యంతాద్భుతమై నిత్యమై యానందమును బుట్టించుచుండునట్టి పరమపద మింతింతయని లెక్కింప శక్యముగాదనియు భగవంతుని యిచ్ఛచేత గృహగోపుర ప్రాకారములు మొదలయిన గృహోపకరణములనిత్యములుగఁ గలవనియు లక్ష్మీభూనీళలతోఁ గూడి శ్రియఃపతి సుఖము ననుభవించునట్టి యుపకరణవస్తువులచేతఁ దృప్తిని బొందించునదియు అట్టి నిత్యవిభూతి యందుండి పరమపదవాసులు సుఖము లనుభవింతురనియు సర్వబ్రహ్మాండములలోనున్న చేతనులను గటాక్షించుచు లీలావిభూతి యనుభవించుచుందు రనియు సత్త్వశూన్యమగు కాలమనిపించుననియు అందు నాత్మలు లేకుండుటం జేసి సత్త్వశూన్యమనం బడియుండునని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శుద్ధసత్త్వమును సత్త్వశూన్యం బానతిచ్చి మిశ్రసత్త్వమైన ప్రకృతిస్వరూపము మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ త్రిగుణంబు ప్రకృతి తత్త్రిగుణ కార్యము మహత్తత్త్వంబు అది బుద్ధి ధర్మమరయ। దానవై కారిక తైజస భూతాది సంజ్ఞన హంకారసంభవంబు। వైకారికంబందు నేకాదశేంద్రియ గణము భూతాదిని గలిగిశబ్ద। తన్మాత్ర మొదలైన తన్మాత్రపంచక భూతపంచకములు పుట్టునపుడు। ఉభయసహకారి తైజసముచితవృత్తి। దైవమీచతుర్వింశతితత్త్వములను। జేర్చి బ్రహ్మాండములఁ జేయుఁ జేతనులకు। నుండనని చెప్పె లక్ష్మణ యోగివరుఁడు॥ ౧౫

తా॥ త్రిగుణములయిన సాత్త్విక రాజసతామసాదిగుణములతోఁ గూడినవి వాదములకు మొదల తేజమను మహత్తును బుట్టించి దానివలన వైకారికం తేజసంభూతాదిని నహంకారము పుట్టెననియు ఆయహంకారము చేతఁ బంచభూతములు గలిగెననియు ఆభూతములవలన శబ్దస్పర్శ రూపరస గంధాదులు పుట్టెననియు వాని విషయములయిన జ్ఞానేంద్రియములును గర్మేంద్రియములునుగూడ దశేంద్రియములు గలిగెననియు మనస్సు ఉభయేంద్రియములకు సహకారియనియు బుద్ధిచిత్తాహంకారములు కలిగెననియు నిరువది నాలుగు తత్త్వములనుగూర్చి శ్రియఃపతి బ్రహ్మాండములు చేసెననియు అందుసర్వాత్మలకును నునికిఁ జేసెననియు లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (మిశ్రతత్త్వములగుణములానతిచ్చి చిత్తునచిత్తుకుం గర్తయైన పరమాత్మయుండెడి విధమెట్లన్నను మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శేషభూతాశేష చిదచిద్రమాశేషి సత్య బోధామల స్వ స్వ

రూపి । జ్ఞానబలైశ్వర్య శక్తితేజోవీర్య సౌశీల్యముఖ గుణాశ్రయ నిజాత్మ ।
స్వానురూపాభీష్ట సౌందర్యలావణ్యవిశ్వమోహన బృహద్విగ్రహుండు । ని
త్యముక్తసమేత నిత్యాపరిచ్ఛిన్న భోగ్యభూతమహావిభూతి యుతుండు । సృష్టి
పాలనసంహృత్యభీష్టమోక్ష । నేతసర్వజనాశ్రయణీయచరణుఁ । డాదిదేవుఁ
డు నారాయణాహ్వయుండు । అతఁడు లక్ష్మీశుఁడని లక్ష్మణార్యులనిరి॥ ౧౯

తా॥ సమస్తమైన భూతకోటులు శ్రియఃపతికి శేషమై యుండుననియు
అద్వైతము చిత్తుకును నచిత్తుకును పెరాట్టికిని శేషియనియు వేదముచే స్తోత్ర
ము చేయఁబడిన వాఁడనియు హేయగుణ రహితుండనియు తనకుఁదానె సౌం
దర్యముగలవాఁడనియు జ్ఞానబలైశ్వర్య శక్తితేజో వీర్యములయిన షడ్గుణము
లుగలవాఁడనియు నిష్టమయిన చక్కఁదనముగలిగి సర్వాత్మలును మోహించె
డి విగ్రహము గలవాఁడనియు నఖిలజగత్తులను సృష్టిస్థితి సంహారాదులచే
యుచునుండెడి వాఁడనియు చల్లనినిర్హేతుక దృష్టులచేత నొకానొకనికి
మోక్షమిచ్చువాఁడనియు సకలాత్మలకుఁ దన శ్రీపాదములే గతియని చూపు
చున్నవాఁడనియు నారాయణుండను తిరునామముకలవాఁడనియు పెరియపి
రాట్టికిఁబతియైన వాఁడనియు లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (పరమాత్మస్వరూ
పంబానతిచ్చి యీమూఁడు తత్త్వములతోఁగూడిన చేతనులకుఁ దత్త్వనిర్ణయ
ము ప్రత్యక్షమనెడు నర్థముమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ప్రకృతియుఁ బురుషుండుఁ బరమాత్మయును నన మూఁడు త
త్త్వంబులీ మూఁటివిధము । చెప్పంగవినువాఁడు చేతనుఁడైతన ప్రకృతి సం
బంధంబుఁ బాయవలసి । యీరెంటికిని బరమాత్మయొక్కఁడె మూలకర్త
యాతఁడు రమాకాంతుఁడనుచు । భాష్యకారులుతత్త్వ పరశాస్త్రములు
చూచి యానతిచ్చిరి వారినాశ్రయించి । బ్రతుకుఁడని సర్వజనులకుఁ బరమ
హితము । చెప్పిరక్షించవలెనని చింతఁజేసి । యతనితిరునామసంకీర్తనాకృతు
లుగ । నానతిచ్చిరి మాలక్ష్మణార్యులిపుడు॥ ౨౦

తా॥ శరీరము ఆత్మ పరమాత్మ యీమూఁడు తత్త్వంబులును మూఁడువి
ధములైనవని యానతిచ్చుచున్నారు చెప్పఁగావినువాఁడును జెప్పువాఁడు
ను చేతనుఁడైన జీవుండు తనకుఁ బ్రకృతియైన దేహసంబంధము విడువ వలసి
యుండెనాయప్పుడు దేహమునకును ఆత్మకును శ్రియఃపతి మొదటికర్తయని
తెలిసి యెంబెరుమానారు పరమహితముచెప్పి రక్షించవలెనని చింతచేసి వే
దశాస్త్రములు పరిశీలించి యీనిర్ణయము సకలాత్మలును నెఱుఁగునట్లానతి

చ్చిరనియు తచ్చరణములాశ్రయించి బ్రతుకుండనియు అతనితిరునామమును సం
కీర్తనముచేసి సర్వాధికారము గాఁగడ తేరుడని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (చి
త్తుకు నచిత్తుకును శ్రియఃపతి కర్తయని యెంబెరుమానారు తిరునామనిర్ణయ
ముగానానతిచ్చి యీతత్త్వత్రయముచేత జగత్తుకూడియున్నది గనుకయేత్వా
టునెఱింగియుండవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ చిదచిదాత్మక జగచ్ఛేషి లక్ష్మీకాంతుఁడతనికి దేహమీ యఖి
లజగము । అతఁడును దనదేహమం దవయవముల భంగి ననేకులై పరఁగు
చున్న । వివిధదేవాది ప్రవృత్తులఁగలిగించి యఖిలాంతరాత్మయై యనవరత
ము । తనచేతఁదనతలఁదా గోకుకొన్నను దలదో చేతిదో సుఖముతనదో య
మఱుఁ । దెలిసినిశ్చింతుఁడై కాదె తేరినిఖిల । కర్మకర్తృత్వభోక్తృత్వగం
ధరహిత । పారతంత్ర్యానుసంధానపరతదగిలి । యుండెనెప్పుడు లక్ష్మ
ణయోగివరుఁడు॥ ౨౧

తా॥ చిత్తునచిత్తునకుఁ గర్తయైనయతండు పెరియపిరాట్టికిఁ గర్తయైన
వాఁడనియు ఆపెరియపిరాట్టిని గూడినజగత్తు అతనికిఁ దిరుమేనయినదని
యు ఆతిరుమేనుకు నవయవములున్నటుల దేవతిర్యఙ్మనుష్యస్థావరాత్మకము
లఁ బుట్టించెననియు తానుసర్వాంతర్యామియై తనచేతఁదనతలఁదా గోకుకొ
న్నను ఆసుఖము పరమాత్మదో లేకజీవాత్మదో శరీరముదో అనియుఁడగానీ
మన్నన్ను తెలిసినిశ్చింతుఁడై విచారమువిడిచి సమస్తకార్యములు చేయుచునం
దలికర్తృత్వ భోక్తృత్వాదులు తనవికావని యతఁడెకర్తయనియు వాసనారు
చులతోడవిడిచి పారతంత్ర్యమును సంధించుకొని ముముక్షుండుండునని లక్ష్మ
ణార్యులానతిచ్చిరి॥ (ముముక్షువు స్వాతంత్ర్యమువిడిచి సకలప్రయోజనము
లయందుఁ బరతంత్రుఁడై యుండవలెనని యానతిచ్చి నానావిధములైన యా
త్మలకు నారాయణుండు దిక్కని మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ నారాయణుఁడె కర్త నానావిధాత్మలు నతనికై కలుగుట యె
రసినపుడు । దనసుఖస్థితికే నాతఁడె సాధనంబని మఱి స్వప్రయత్నముల్ మా
నినపుడు । దాఁబోయినట్లనైతస్యంబుఁ బోయిన వేఱువ్యాపారముల్ విడిచి
నపుడు । దగ్దాసజాత విద్యావృత్తముల యందు నెక్కువతక్కువ లెఱుఁగ
నపుడు । ఇట్టిసుఫలంబులన్నియు నెఱుఁగఁజెప్ప । నవతరించినయతిరాజులనిన
యప్పుడు । గాక మోక్షంబునరులకుఁ గలుగుటరుదు । సత్యమిదియనె లక్ష్మణా
చార్యవరుఁడు॥ ౨౨

తా॥ సకలాత్మలను నారాయణుండు గలుగఁ జేసెనని యెఱిఁగి నప్పుడు. తనసుఖస్థితికి నతఁడె సాధనంబని యెఱిఁగి తనయత్నములుమానినప్పుడు తన మనస్సు పోయినట్లు తనవిషయములుపోయినను దుర్వ్యాపారములువిడిచి నప్పుడును అతనిదాసుల జాతిని వారివిద్యలను వారినడతలను నెక్కువతక్కువ లెఱుఁగ నపుడని యిట్టి యర్థంబు లెఱుంగఁ జెప్పనవతరించిన యతిరాజుల నిన యప్పుడుగాక మోక్షము నరులకుఁ గలుగఁటసుదనియు సత్యమిది యని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥

గద్య. ఇది ముముక్షుజనకల్పకంబను మహాప్రబంధంబునందు జగత్కారణభూతజ్ఞేయ వస్తునిర్ణయ ప్రకారంబును తత్ప్రాప్తిరూపఫలసాధన సౌకర్యోక్తిప్రకారంబును బాహ్యకుదృష్టి మతోత్పత్తి హేతుకథన పూర్వకమంత్రార్థ నిర్ణయ ప్రకారంబును వేదవేదాంతేతిహాసాదినిశ్చిత స్వరూపోపాయపురుషార్థ విరోధిప్రకారంబును ప్రత్యక్షాది ప్రమాణోత్కృష్టవేదాంత తాత్పర్యవర్ణనంబును కర్మబ్రహ్మప్రతిపాదకము భాగద్వయాత్మక వేదవేద్యవస్తునిర్ణయప్రకారంబును తత్వహితప్రవర్తక వేదార్థ ప్రకారోక్తి తాత్పర్యవర్ణనంబును సద్బ్రహ్మాది సాధారణోక్త జనదేవ పరిత్యాగవాచ్యవిశేష శబ్దపర్యవసానప్రకారంబును పరత్వాది పంచప్రకారావస్థితవేదవేద్యప్రతిపాదక వేదావతారప్రకారంబును వేదోపబృంహణార్థ తాత్పర్యవర్ణనంబును వేదశాస్త్రనిశ్చితతత్వహిత పురుషార్థాధికార స్వరూపంబును బ్రాహ్మణోత్కర్షహేతు ప్రకారంబును అన్వయ వ్యతిరిక్తోక్తిద్వయోక్తి మంత్రతాత్పర్యవర్ణనంబును తత్వత్రయస్వరూప స్వభావాజ్ఞాన సాధన ప్రకారంబును చిదచిదీశ్వర స్వరూప స్వభావకథనంబును తత్వత్రయజ్ఞాన ప్రదాచార్యవైభవంబును సత్తాస్థితి ప్రవృత్తిహేతుభూత నారాయణైక నిష్ఠామాత్రనిరూపక తదీయ వైభవంబును బ్రహ్మనిష్ఠానుసంధాన ప్రకారంబు నన్నది ప్రథమ ప్రకరణము.

ఇది ముముక్షుజనకల్పకంబునఁ బ్రథమ ప్రకరణము.

శ్రీమతే రామానుజాయనమః.

## ద్వితీయ ప్రకరణము.

శ్రియఃపతిని వేదాంతములచేతఁ బరతత్వము నిశ్చయమని

యానతిచ్చి పాంచభౌతికమైన ప్రకృతిగల్పించి శ్రియఃప

తిన్నైన పరమాత్మ తానందుఁ బ్రవేశించి, సకల ప్రపంచ
మును సృష్టించుచున్నారని మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ పరమాత్మ హరి దానె బ్రహ్మాండములఁ జేసి యందందు బ్రహ్మలనమ
రఁ జేసి। లోనఁ జతుర్దశలోకంబులను జేసి యధికారపురుషుల సందమర్చి। తిరు
గ దేవ మనుష్య తిర్యగాది సమస్తజంతుజాలము కర్మానుసరణిఁ జేసి। భోగమో
క్షనిదాన పుణ్యపాపక్రియోపాసనన్యాసప్రపంచవిధుల। నెఱుఁగఁ జెప్పెడి
శాస్త్రంబులిచ్చి వారు। చనెడి సన్మార్గ దుర్మార్గ సంగతులకుఁ। జిత్తసమ్మ
త్యుపేక్షలఁ జేసుకొనుచు। నుండునని చెప్పె లక్ష్మణయోగివరుఁడు॥ ౧

తా॥ చిత్తును నచిత్తుకును గర్తయైన పరమాత్మ తానె మహత్తును నహంకా
రపంచభూతములఁ గల్పించి బ్రహ్మాండములఁ జేసెననియు ఆయా బ్రహ్మాం
డములలో నాయా బ్రహ్మలనమరఁ జేసెననియు నాకొక బ్రహ్మాండములో
పలఁ బదునాల్గు లోకములఁ జేసెననియు ఆయా లోకములకు నధికారుల న
మరికఁ జేసెననియు సంహారమున సకలాత్మలకును వారి వారి కర్మవాసన
లు తెగకయుండఁగా ఆకర్మవాసన లుత్పత్తికి హేతువుగాఁ గావించి తిరు
గ దేవ మనుష్య స్థావర జంగమాదులుగా సమస్తాత్మలను జన్మించినటులఁ జే
సెననియు ఆత్మలకు భోగ మోక్షాదులు గలుగఁ జేసెననియు ఆయాత్మ లది
యెఱుఁగక అజ్ఞాన పరవశులై పుణ్యపాపక్రియలకులోనై బద్ధులైన యాత్మల
ను గటాక్షించి శరణాగతి యానతిచ్చె ననియు ఆయా విధుల నెఱుఁగఁ జెప్పె
డి శాస్త్రములనిచ్చెననియు ఆయాత్మలు పోయెడి సన్మార్గమును దుర్మార్గము
ను అందుకుఁదగిన సంగతులను మనుష్యుని సమ్మతిఁ జేసుకొనియు నుపేక్షలఁ జే
సుకొని యుండునని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ ( ఆత్మలు కర్మపరవశములై శరీర
ములెత్తి మరియు నాకర్మములే చేతురని యానతిచ్చి యట్టియాత్మలు ప్రకృ
తికిఁ బరవశులై పుణ్యపాపరుచులకులోనై సంసారులైన యాత్మలను శ్రియః
పతి వీక్షించి రక్షించు విధము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సంహార దశను చిత్సములయ్యు హరికృప కరణ కళేబర ఘటితులగు
చు। నజ్ఞానరుచివాస నానురూపక్రియా పరతంత్రులై బహుభంగిఁ బుట్టి।
యాయుః పరిమితయమైనంత స్మృతిఁ బొంది పాపపుణ్య ఫలానుభవముఁ జేసి।
తామసగర్భాది సప్తావస్థలందును దాపత్రయాది సంతప్తులగుచు। దుఃఖ
సాగరమగ్నులై తుదయు మొదలు। గానఁ గానేరక తిరుగాడఁగాను దానె।
చూచి కరుణించి హరి చేతఁ జూడఁబడిన। యతఁడు కడతేఱునని లక్ష్మణార్యులనిరి॥

తా॥ సంహారమందీ యాత్మలు సమస్తమును మూలప్రకృతియందుఁ గ
లసియుండుననియు సృష్టికాలమందు శరీరేంద్రియాదుల శ్రియఃపతి కృప
చేతనిచ్చుననియు ఆ శరీరేంద్రియములకు నజ్ఞానము హేతువై రుచివాసనలు
విడువక యావిషయములకుఁ బరతంత్రులై బహువిధములైన శరీరము లెత్తు
దురనియు ఆయాశరీరములకు నాయుస్సు దీరిన మరణములు పొందుదురని
యు నీతీరునఁ బుణ్యపాప రూపములైన కర్మము లనుభవించుచు నుందురని
యు తాము గర్భ జన్మబాల్యయౌవన కౌమారవృద్ధమరణాదులైన సప్తావస్థ
లయందును ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికమనెడి తాపత్రయాదులఁ జి
క్కి దుఃఖసముద్రములోఁబడి తుదమొదలు గాననేరక తిరుగులాడఁగా శ్రియః
పతితానె నిర్హేతుక కృపచేత దృష్టించిన నాయాత్మ కడతేరునని లక్ష్మణార్యు
లానతిచ్చిరి॥ ( అట్టి పుణ్యపాపములు సకలాత్మలను బంధించియున్నది గనుక
యేలినవాని కృపచేతఁ గడతేరునని యానతిచ్చి సకలాత్మల నాపుణ్యపాపము
లు పొందియుండెడి విధము మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ సుకృతదుష్కృతమూల సురనరాద్యుద్భవతర తను సుఖదుఃఖధర్మ
లకును । వేదపాఠ బ్రహ్మవిద్యాధికార సద్బ్రాహ్మణ క్షత్రియవైశ్యులకును ।
తదనువర్తన ధర్మదార శూద్రులకును వర్ణసంకరజాతి వర్తనలకుఁ । బశు
పక్షి మృగనగ ప్రభృతి జంతువులకు సంసారజలధియే స్థానమరయ । వీరి య
భిజన విద్యాది వృత్తములకు । మూలమానంద నిర్భర మోక్షహేతు । విశ్వస్ర
ష్ట్యాది లీలైకవిష్ణుమాయ । యదిదురత్యయమని లక్ష్మణార్యులనిరి॥ 3

తా॥ పుణ్యపాపములు మొదలుగా జన్మించిన దేవతలకును మనుష్యులు
మొదలైనవారికి ననుబంధిగా విడువక సుఖదుఃఖ ఫలముల నిచ్చుననియు వే
దశాస్త్రములు చదివిన బ్రాహ్మణులకు క్షత్రియులకు వైశ్యులకు వారలయ
నువర్తనము గలిగిన స్త్రీలకు శూద్రులకు వర్ణశంకర జాతులకు మఱియుఁ ద
క్కిన పశువులకు పక్షులకు మృగములకుఁ బర్వతములకుఁ గ్రిమికీటకములు
మొదలైన యాత్మకోట్లకును సంసార సముద్రమే స్థలమై యుండుననియు ఈ
యాత్మల యొక్క దేహసంబంధమునఁ గలిగిన కులాదులు నేర్చినవిద్యలును
ఆచారములును ఈ యిన్నిటికిని బుణ్యపాప రూపమై యుండు కర్మ
ములే మూలమనియు ఆనంద నిర్భరమైన మోక్షహేతువు కలిగి యుండఁగా
నీలోకము సృష్టించి తనమాయ పంపుచు లీలనడుపుచున్న విష్ణుమాయ కడ
చి కడతేరుచున్నను నెంత వానికిని మాయనుగడచి పోఁగూడదని లక్ష్మణార్యు

లానతిచ్చిరి॥ ( పుణ్యపాపరూపములైన శ్రియఃపతి మాయ నెఱిఁగి కడతేరు
నది మహాదుర్లభమని యానతిచ్చి మనుష్యుఁడై పుట్టి వివేకము గలిగియుండు
టయరుదని మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ పుడమిలో నీకర్మ భూమి జన్మం బరుదది గలిగిన నరుఁడౌట యరు
దు । నరుఁడైన హరిపేరు నమ్మి చెప్పెడి దరుదది చెప్పినా స్మరణాశయరుదు।
ఆస్మృతిగూడెనా యాత్మార్పణంబరు దర్పించెనా యహమడఁచుటరుదు । ఆ
యహంకృతితదీయాను వర్తనబుద్ధియరుదది గలిగెనా యాత్మగురుని । యందు
మానుషబుద్ధి దానడఁగుటరుదు । భాగ్యమునదిన్ని గలిగిన భాష్యకార । భక్తిగలి
గెడిదరుదని పరమకృపను। జెప్పెలక్ష్మణముని మోక్షసిద్ధికొఱకు॥ ౪

తా॥ ఈభూలోకములోన నీజన్మ భూమిని నేజన్మమైనఁగలిగెడి దరుదని
యు ఆ జన్మము కలిగెనా మనుష్యుఁడై పుట్టుట యరుదనియు మనుష్యుఁడై జ
నించి శ్రియఃపతి పేరునమ్మి చెప్పునది యరుదనియు శ్రియఃపతి పేరుపల్కఁగలి
గెనా స్మరణగలుగునది యరుదనియు ఆస్మరణ గలిగెనా యాత్మను సమర్పించు
నది యరుదనియు అర్పించెనా యహంకార మనెడు గుణము మానునది యరు
దనియు అయహంకారముల శ్రీవైష్ణవానువర్తనము మనుస్సుననుండెనా యది
పోవుననియు అదిగలిగెనా సదాచార్యుని యందు మనుష్యబుద్ధి మానునది య
రుదనియు తనభాగ్యమున నిదిగలిగెనా భాష్యకారులయందు భక్తి గలుగునది
యరుదని పరమకృపతో మోక్షసిద్ధికొఱకు లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (పుట్టిన జ
న్మముగలిగి వివేకజ్ఞానము గలిగినను నెంబెరుమానారు సంబంధముగలుగునది
యరుదని యానతిచ్చి యతని వైభవముమీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ సర్వేశ్వరుండను జలధిలోపలనున్న కల్యాణగుణగణాకారజలము। శ
ఠకోపయోగీంద్ర జలదంబుతాఁగ్రోలికొనివచ్చి నాథాద్రి గురియునదియుఁ ।
పుండరీకాక్షులు ఘువిరామమిశ్రులు నమనిర్ఝరంబులు నరుగఁడెంచి । యమ
గాహనార్హ తయాము నాపగఁజొచ్చివచ్చి తచ్ఛాత్ర ప్రవాహగతిని । జేరి
యతిరాజులను దొడ్డచెరువునిండి । వెడలి దేశికతూముల వెంటవచ్చి । ప్రా
ణిసస్యంబుపైఁ బారఁబండుకర్ష । కాత్మనాథునికని లక్ష్మణార్యులనిరి॥ ౫

తా॥ సర్వేశ్వరుఁడైన శ్రియఃపతియొక్క కల్యాణగుణములనెడి మహాస
ముద్రమునందు నమ్మాళ్వారనియెడి కాలమేఘము గుణములనియెడి జలమును
పానముచేసి శ్రీమన్నాథముని యనెడు మహాపర్వతముమీఁద వర్షము గురిసె
ననియు ఆపర్వతమందుయ్యకొండారు మనకాళ నంబిగారను రెండుసెల

వేఱులు పుట్టిపాఱఁగా. శ్రీయాళ్ వంచారనియెడు నేటితోఁగూడి వే. ఉపా రి. సముద్రముతోసరియయిన యెంబెరుమానారనియెడి దొడ్డచెఱువులోఁబడి యాచెఱువు జలము నిండారుగానిండెననియు ఆచార్యులనియెడి తూముల వెంట నా జలమువచ్చి యాత్మలనియెడి పైరులమీఁదఁ బాఱఁగా నా పైరుపండెననియు పంటకాపు ఆత్మగు నాథుఁడై యుండెడి శ్రియఃపతికని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ఎంబెరుమానారు వైభవమానతిచ్చి యాత్మలను సర్వేశ్వరుండు పట్టి కడతేర్చెడు విధముమీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ అచిద విశేషితులై యాత్మలుండఁగా కరణ కళేబర ఘటితులఁగ
ను । గరుణించి వారుదుర్గతులఁ జెందక యుండ సదసద్వివేక సచ్ఛాస్త్రమి
చ్చి । యదియును నిష్ఫలంబైపోయినప్పుడు తా సజాతీయుఁడై ధరణిఁబుట్టి।
తత్త్వోపదేశంబు తగఁ జేసినప్పుడు నాకంఁడు నీడేరనోపకున్నఁ । దెలిసి వ్యా
గములఁ బట్టుచోదీము వెట్టి। పట్టుభంగినిదనకు సద్భక్తులైనయా। యాళువారు
లఁ బుట్టించెనచ్యుతుండు । జనులకొఱకని లక్ష్మణార్యులనిరి॥ ౬

తా॥ మునుపుసంహారమందీ సకలాత్మలకు శరీరములు లేకయుండఁగా నీతీరున నుండనీని తమకైంకర్యాదులు కొదువఁబడునని దేహేంద్రియాదులనిచ్చెననియు ఆ యాత్మలమీఁదఁ గృపయుంచి వారు దుర్గతులఁ బొందకుండ వివేకమైన శాస్త్రములనేలిన వాడిచ్చెననియు అవి చదివియు నిష్ఫలమాయెననియు తాను మనుష్యరూపమున నవతారమై పరతత్త్వనిర్ణయము తానే యని ప్రమాణముగా నానతిచ్చిన నాకందును విశ్వసించి యీడేరక పోయెనని శ్రియఃపతి తెలిసీ వేటకాఁడు దీముమృగమును జేపట్టి యడవిలోమృగముల బట్టినట్లు తనకావులైన యాళ్వారులను నవతారముగునట్లు సేసె ననియు వారివలన సకలాత్మలును గడతేరుదురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ) శ్రియఃపతి యీయాత్మలయందుఁగలిగిన కృపాతిశయము నానతిచ్చి పన్నిద్దరాళ్వారులమీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ మహీసరో వరభూత మహదాహ్వయులుమువ్వురుదయ
మందిరి మున్నయోనిభవులు । శ్రీభక్తిసారులు శ్రీపరాంకుశులను గుల
శేఖరులు భట్టనులవలియును । భక్తాంఘ్రిరేణు సత్పదయోగిభాహులు పర
కాలులును ననఁబడుగురిచట । వరుసజన్మించిరి వారిలో శఠవైరి కర్మణాస్వ
దులు మధురకవులు వెనుక । భాష్యకారులు సహితంబుపరిగణ్యనకు । నైరిప
న్నిద్ధరాళ్వారులనఁ బ్రసిద్ధు। లందుఁ బెరియాళువారికి నవతరించెఁ । గోద

యనిచెప్పె లక్ష్మణగురువరుండు॥

తా॥ ఆళ్వారుల లోపల మున్నెన్నఁ దగినవారు పొయిఘపేయ పూదత్తాళ్వారులని యీ మూఁడు తిరునామములు గలిగి యయోని సంభవులై యున్నరసియు తిరుమళిశియాళ్వారు నమ్మాళ్వారు కులశేఖరాళ్వారు పెరియాళ్వారు తొండరడిప్పొడి యాళ్వారు తిరుప్పాణి యాళ్వారు తిరుమంగయాళ్వారు వీరు పదుగురును వీరిలో నమ్మాళ్వారి కృపకుఁ బాత్రుఁడు శ్రీమధురకవి యాళ్వారు ఆవెనుక భాష్యకారులు గూడఁ బన్నిద్దరాళ్వారులైరి వీరిలోఁ బ్రసిద్ధుఁడగు పెరియాళ్వారునకు నవతరించెఁ జూడికుడుత్త నాచ్చియారని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఈవిధము నాళ్వారుల తిరునామముల నానతిచ్చి వీరిలో నమ్మాళ్వారుల వైభవ మువీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ శఠవైరి ముఖభక్త జనవైభవ మెఱింగి వర్ణింప మావంటి వారివశమె । సందర్శనస్పర్శ సల్లాపములచేతఁ దత్ప్రబంధావృత్తి దానములను। దన్ముఖోదిత వేద తాత్పర్యనిష్ఠలఁ దద్దాస్యవృత్త్యన్వితక్రియలను। దద్దివ్యనామసంతత కీర్తనంబులఁ దద్గుణామృత పానతత్పరతను । ముక్తులై పోవు జనులకు మొక్కి సురలు । ద్రవిడ దేశంబులోపలఁ దాము వచ్చి । కలియుగంబున జన్మించఁ గాంక్షఁ జేతు । రనుచు లక్ష్మణమునివరుం డానతిచ్చె॥ ౮

తా॥ నమ్మాళ్వారు మొదలైనయాళ్వారుల వైభవం బింతటి వైభవం బనివర్ణింప మావంటివారివశము గాదనియు అదియెటువలె ననఁగా నతనితిరు మేనిసందర్శనములచేత నతని శ్రీహస్త స్పర్శనములచేత నాతని సహవాససల్లాపములచేత నతఁ డానతిచ్చిన దివ్యప్రబంధములచేత నాతని శ్రీసూక్తులైన వేదతాత్పర్యనిష్ఠలచేత నతని దాస్యవృత్తికి ననుకూలమైన క్రియలచేత నతనితిరు నామములుకీర్తించి నందుచేత నతనికల్యాణ గుణామృతపాన తత్పరతచేత సర్వజనులును ముక్తులై పోదురనియు అట్టిముక్తులర్చిరాది మార్గమునఁ బోఁగా దేవతలు మ్రొక్కుచు ద్రవిడదేశములోపలఁ దాము వచ్చి కలియుగంబున జన్మించఁ గాంక్షింతురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఆళ్వారి వైభవముఁ దత్సంబంధముల నానతిచ్చి యతని తిరునక్షత్రము నవతార దివ్యదేశమును మీఁదఁ నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ పొయిఘు పూదప్పేయ రయిన నామంబుల మొదలాళ్వారులు ముగ్గురుతొల్లి । మహిఁ గంచి తిరుకడల్ మల్లైమైలాపురంబును మాళ్లసర్వే

శ్వరాజ్ఞఁ జేసి । శ్రవణధనిష్ఠాఖ్య శతభిషార్క్షంబుల మంచి యల్పిసిం దులా మాసమందు । జన్మించి భూమిని సంచరించుచువచ్చి తిరుకోవలూర మున్గురు నుగూడి । కనిరి లక్ష్మీనుఁ దామమృకండుఁ డనెడి । బ్రాహ్మణోత్తము గేహ సీభాగమందుఁ । దామె యందాదులను బ్రబంధములఁ జేసి । రనుచు లక్ష్మణ
మునివరుం డానతిచ్చు॥ ౯

తా॥ పొయిగై పూదత్త పేయాళ్వారు లనెడి మొదలాళ్వారులు మున్గురును దొల్లి కంచిలోపలను దిరుకడల్ మల్లై యనియెడి స్థలము లోపలను మైలాపురమందును శ్రవణ నక్షత్రమందును ధనిష్ఠా నక్షత్రమందును శతభిషనక్షత్రమందును దులామాసమైన యల్పిసి మాసమునఁ దిరువవతరించి రనియు ఈమున్గురాళ్వారు లొకరొకరి నెఱుంగక దివ్యదేశములు సంచరించుచుఁ దిరుకోవలూరిలో మున్గురును గూడిరనియు శ్రియఃపతిని మృకండునిగడపలోఁ గని సేవించిరనియు వేదాంతములచేత నంతాదులను ప్రబంధములుచేసిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( మొదలాళ్వారుల నవతారములను దిరునక్షత్రములును మాసములును దివ్యదేశములును నానతిచ్చి తిరుమழிశియాళ్వారి యవతార వైభవముమీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ శ్రీ భక్తి సారులు శ్రీ వల్లభుని యాజ్ఞ మహిసారమను తిరుమழிశిలోన । మనకుఁగాఁ దయ్యను మకర మాసమునందు మఖయను తారను మహిజనించి । యాఱు మతంబుల యందుఁ బ్రవేశించి యందు సారాసారమురసిచూచి । వైష్ణవుండై రమావల్లభుఁ గొనియాడినవి ప్రబంధములవ్వే నతనిమహిమ । యజ్ఞమందును బ్రాహ్మణాధ్యయనమందుఁ । గంచిలోపలఁ గని కృష్ణకథలయందు । నితరమగుచోట్ల వినఁబడు నీమహాత్ముఁ । దరుదయుం
డనె లక్ష్మణ యోగివరుఁడు॥ ౧౦

తా॥ భక్తిసారులైన తిరుమழிశియాళ్వారు శ్రియఃపతి యనుజ్ఞవలన మహీసారమనియెడు తిరుమழிశిలో మకరమాసమైన తైమాసమందు మఖయను తిరునక్షత్రమందు జన్మించెననియు ఆఱు మతములయందుఁ దాను బ్రవేశించియందుఁగల సారాసారముల నేర్పరచిరనియు అవి గావని శ్రీవైష్ణవుండై శ్రియఃపతిని గొనియాడఁగా నదిదివ్యప్రబంధములాయెననియు నతనిమహిమలు యజ్ఞమందును బ్రాహ్మణాధ్యయన మందును గంచిలోపలఁ గని కృష్ణుని కథల యందును నెఱుఁగ వచ్చుననియు నిదిగాక తక్కినచోట్లను వినఁబడును నీమహాత్మునికీర్తియని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( తిరుమழிశియాళ్వారి వైభవముల

నానతిచ్చి నమ్మాళ్వారి వైభవముమీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ ప్రఖ్యాతమగు తామ్రపర్ణి తీరంబున నందమై తగు తిరు నగరిలోన । శ్రీశ దత్తజ్ఞాన సిద్ధిసంపన్నుఁడై శఠవైరి వృషభ విశాఖ యందు । నవతరించియుఁ బరాగర్ధ ధర్మనముడిగి తింత్రిణీమూల సంస్థితివహించి। పరహానీ ధ్యాన తత్పరతమాటలు మాని యనుభవింపఁగ లోన నడఁగ కఫుడు। దామె యనుభవమీ ప్రబంధ ముఖమునను । వచ్చి తిరువాయిమొళ్ళి తిరువాశిరియము । పెరియవందాది తిరు వృత్తభేదములను । నంఁడె ననిచెప్పె లక్ష్మణ యోగివరుఁడు॥ ౧౧

తా॥ నదులలోఁ బ్రఖ్యాతిగాఁ జెప్పబడిన తామ్రపర్ణి నదీతీరమందున్న తిరునగరిలో వృషభ మాసమున విశాఖా నక్షత్రమందు శ్రీయఃపతి ప్రసాదించిన జ్ఞాన సంపన్నుఁడైన నమ్మాళ్వారు తిరు నవతరించిరనియు నవతారమై తిరునయనములు మూసుకొని పాకృత పోషణ లొల్లక తిరుప్పాణియాళ్వారు తొల్లి గోఁ బ్రవేశించి కూర్చుండిరనియు శ్రీయఃపతి శ్రీపాద పద్మామృత మనుభవించుచు నన్యులతో సంభాషణములు మానిరనియు ఆయమృత మనుభవించి తమలోపల నడంగక యాయనుభవము తామె యీ ప్రబంధముఖమున నానతిచ్చిరి తిరువాయ్మొళ్ళియు తిరువాశిరియ వృత్తము ను పెరియ తిరువందాదియు తిరువృత్త భేదమును ననియెడి ప్రబంధములుచేసిరని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ ( నమ్మాళ్వారి యవతార వైభవమానతిచ్చి కులశేఖరాళ్వారి వైభవముమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ కొల్లి నగరమేలు కులశేఖరులు శుభాకరులును దిరువంజి కళమనూర । మాశియనియెడు కుంభనుందుఁ బునర్వసు నక్షత్రమునఁ బుట్టి నరుల నెల్లఁ । బాలించుచుండియు భాగవతోత్తమ సహవాసమున నన్యసంగ ముడిగి । శ్రీవైష్ణవులకుఁగాఁ జేత సర్పముఁ బట్టి ఖలునిమీఁదికి దండుకదలిపోయి । యనువినంబును శ్రీరంగ యాత్రఁ జాటి । స్థావరత్వము తిరుమల తమకుఁ గోరి । యనుభవించుచుఁ దిరుమొళ్ళి యనుప్రబంధ । మానతిచ్చిరి యని లక్ష్మణార్యులనిరి॥ ౧౨

తా॥ కొల్లినగరమను పట్టణమేలెడి కులశేఖరాళ్వారులు తిరువంజి కళమనూరను గుంభమనియెడి మాశి మాసమందుఁ బునర్వసు నక్షత్రమున నవతరించిరనియు సర్వమైన జనులఁ బాలించు చుండియు నన్యులతోడి సంగమంబు విడిచి భాగవతోత్తముల సహ వాసముఁ జేసిరనియు శ్రీవైష్ణ

వ్రలకొఱఁకు బాముననఁబట్టి ఖలునిమీఁదికి దండుకదలిపోయి రనియు ననుదినం బును శ్రీ రంగయాత్రను జాటిరనియు తిరువేంగడముడయాను తిరుమల మీఁదను స్థావరత్వము కోరిరనియు నీవిధమున ననుభవించుచును తిరుమొళ్లి యను ప్రబంధ మానతిచ్చిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( కులశేఖరాళ్వారి వైభవ మానతిచ్చి పెరియాళ్వారి యవతారమును నతని విభవమునుమీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ శ్రీ విష్ణు చిత్తుఁడు శ్రీ విల్లి పుత్తూర నాని యని యెడి మిథున
మందుస్వాతి । యనుతార జనియించి హరికి నందవనంబు తాఁజేసిదామ
ముల్ తానె కట్టి । యిచ్చుచుండఁగఁ బాండ్యుఁ డింతటఁ బరతత్వమెఱుంగ వి
ద్వాంసులనెల్లఁ గూర్చి । యర్థసంచయము విద్యా శుల్కముగఁ గట్టఁడాఁ ద
త్వమెఱింగించి ధనముఁగొనిన । మెచ్చివచ్చినహరితిరుమేనుకపుడు । పాలనా
గ్ధంబుపల్లాండు పాడిమఱియు । గోపజన్మాను కృతిఁగృష్ణ గుణములెల్లఁ । దె
లిపెననిచెప్పె లక్ష్మణదేశికుండు॥ ౧౩

తా॥ శ్రీ విల్లిపుత్తూరనియెడి దివ్య తిరుపతియందు శ్రీ విష్ణుచిత్తుఁడైనపెరియాళ్వారు ఆనిమాసమనియెడి మిథున మాసమందు స్వాతినక్షత్రమునం దిరువవతరించె ననియు తిరునందవనము తానుజేసి తిరుమాలెలు తానెకట్టివటపత్రశయనునికి సమర్పించుననియు నంతటఁ బాండ్యుండనియెడు రాజు పరతత్వమెఱుఁగ సర్వ విద్వాంసులను రప్పించి ధనము కోట్లకొలంది మూటగట్టించియామూటజ్ఞాన నిర్ణయమనిపించి పరతత్వమేర్పరచి యాద్రవ్యము కొనుండన్నవారల చేతఁ గాకుండఁగాఁ బెరియాళ్వారు శ్రియఃపతే పర తత్వమనియానతీయఁగా నాద్రవ్యముయొక్క మూటతెగిపడెననియు ఆరాజుమెచ్చెననియు నప్పుడు శ్రియఃపతి ప్రసన్నుఁడుగాఁగాఁ దిరుప్పల్లాండు పాడెననియు కృష్ణావతారమందు గోపజన్మము గావలెననియు శ్రీకృష్ణుని కల్యాణగుణములను ప్రబంధములు చేసిరని లక్ష్మణార్యులాన తిచ్చిరి॥ ) పెరియాళ్వారి యవతార వైభవ మానతిచ్చి తొండరడిప్పొడి యాళ్వారి యవతార వైభవము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఉర్వి నుత్తమమైన యూరుమండం గుడి మాసం బులకు నెల్ల
మార్గశిరము । శ్రేష్ఠనక్షత్రంబు జ్యేష్ఠయుగాఁ జూచి జన్మించి లోకసంచా
రమరసి । తామునుకొన్నాళ్లు తదనువర్తి నసమాశ్రయణ లక్షణమున సంచ
రించి । యెటువంటివారికి నీశ్వరభజనంబు కూడునని యెఱుఁగదికొంతఁ జూపి।

యంతఁ దొండరడిప్పొడి యాళువారు । రంగనాధుని కరుణా దరములుగలి
గి । మరిగివాకాయ కాన్మిక మాలెలిచ్చి । కొలిచి రనిచెప్పె లక్ష్మణగురు
వరుండు॥ ౧౪

తా॥ తొండరడిప్పొడి యాళ్వారులు మండం గుడి యనెడు నగ్రహార
మందుమార్గ శిరమాస జ్యేష్ఠా నక్షత్రమం దవతారమైరనియు నీలోకము
సంచరించునట్టి క్రమముగని కొన్నాళ్లు తాము బాహ్మణ నడతలో బ్రహ్మ
చర్యముచేత సంచరించి రనియు నెట్టి వారికిని శ్రియఃపతి సేవనైన శర
ణాగతినిఁ గొంత గలుగఁజూపిరనియు రంగనాధుని కృపకుఁ బాత్రులైయుం
డిరనియు మనోవాకాయ కాద్యులైన తిరుమాలెలు సమర్పించు చుండిర
ని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( తొండరడిప్పొడి యాళ్వారుల యవతార వై
భవము లానతిచ్చి తిరుప్పాణి యాళ్వారి యవతార వైభవముమీఁద నా
నతిచ్చుచున్నారు॥ )

సీ॥ కార్తిక యను వృశ్చి కంబున రోహిణి యను తార వరయూ
రనవతరించి । పారకుండగు తిరుప్పాణి యాళ్వారు శ్రీ రంగవల్లభుని దూ
రమునఁబాడ । స్వామి యంతటలోకి సారంగమునిని భుజమెక్కి రమ్మని యా
జ్ఞనిచ్చినపుడె । యాపాద చూడాంత మనుభవింపుచుఁ బోవ నమలనాథ
ప్పిరానను ప్రబంధ । మైనసన్నిధిఁ దానప్పు డదియుఁబాడి । నిన్నుఁజూచిన
కన్నుల నిన్నె కాని । చూడనన్యులనని నిత్య సూరిజనులఁ । గూడెననిచెప్పె
లక్ష్మణ గురువరుండు॥ ౧౫

తా॥ వృశ్చికమాసమైన కార్తిక మాసమందు రోహిణీ నక్షత్రమున వర
యూరిలో నవతారమాయె ననియు పారకుండైన తిరుప్పాణి యాళ్వా
రు నంబెరుమాళ్లను దూరమునునుండి పాడెననియు ఆ నంబెరుమాళ్లు లోక
సారంగమునిని భుజమెక్కించుకొని తోడ్కొని రమ్మని యనుజ్ఞ నిచ్చెననియు
అటువలెఁ దోడ్కొనివచ్చి సన్నిధిని నిలిపి రనియుఁ బెరియ పెరుమాళ్ల విగ్ర
హము పాదకేశ పర్యంతమును సేవించె ననియు అమలనాదప్పిరాననెడి
దివ్య ప్రబంధము పాడెననియు నిన్నుఁ జూచిన కన్నుల నిన్నెకాని యన్యులఁ
జూడనని నిత్య సూరిజనులఁ గూడెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( తిరుప్పాణి
యాళ్వారి వైభవ మానతిచ్చి తిరుమంగ యాళ్వారి వైభవావతారము
మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ వర కాలుఁడను మహాభాగుఁ డికలఁడఁ గోరయ యూరఁ గార్తి

కకృత్తి కుడుపయందు । జన్మించి వైష్ణవ జనసమారాధన తత్పరుండై కలధ
నము చెగిన । శౌర్యంబునకుఁ జోర సర్వేశ్వరుఁడు పెండ్లి దొరరూపమున వ
చ్చి దోఁపునిచ్చి । మంత్రంబుఁ జెప్పి తన్మంత్రార్థ మెఱిఁగించి కైంకర్యమ
కడకడను జేసి । పెరియ తిరుమొழி మొదలైన పేళ్లుగలుగు । భగవ దనుభ
వరూప ప్రబంధములను । నాఱు తొమ్మన తిచ్చిరి యతని మహిమఁ । దెలియ
నరుదనె లక్ష్మణ దేశికుండు॥ ౧౮

తా॥ క్కొరయలూరిలోఁ గార్తికె మాసమునఁ గృత్తికా నక్షత్రమందుఁ
బరకాలుండైన తిరుమంగ యాళ్వారు తిరువవతార మాయె ననియు కు
ముదవల్లి స్వయం వర నిమిత్తంబున శ్రీవైష్ణవుల కారగింపులు చేయుచుండఁ
దనకుఁగలిగిన ధనము సనుసిపోయెనని చోరత్వమునకుఁజొరఁగా సర్వేశ్వరుం
డైన శ్రియఃపతి పెండ్లి దొరరూపునవచ్చి దోఁపునిచ్చి మంత్రమానతిచ్చి యా
మంత్రార్థము ప్రసాదింప లభించుకొనె ననియు శ్రీయఃపతి కైంకర్య మకడ
డకడఁ జేసెననియు భగవత్కల్యాణ గుణములను బ్రతిపాదించు పెరియ
తిరు మొழிయును తిరునేడుం దాండకమును తిరుకుఱుం దాండకమును చిరి
య తిరుమడలును పెరియ తిరుమడలును తిరుప్పెరు ఘురుత్తిరుకడయును మొ
దలైన పేరులుగల యాఱు ప్రబంధములానతిచ్చినట్టి యతని మహిమలు తెలి
యనరుదని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (తిరుమంగయాళ్వారి వైభవ మానతి
చ్చి శ్రీమధురకవియాళ్వారి యవతార వైభవముమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ కువలయంబునఁ దిరుక్కోవలూరను మేష చైత్ర చిత్రాఖ్య నక్షత్ర
మందు । గౌరవ శ్రీ మధురకవి యాళువారు తామవతరించి విశేష మరయ
వలసి । యుత్తరదేశమందున్న పుణ్యక్షేత్ర దర్శనాపేక్షను ధరణిఁ దిరిగి । శ
ఠజిదుత్పత్తి సంజాత తేజో రాశి దక్షిణంబునఁ జూచి తానువచ్చి । శఠ జిదు
క్త ప్రబంధ విజ్ఞాత చరమ । పర్వనిష్ఠను దత్పదిభి పాదకముగఁ । గణ్ణినుణ్ చి
రుత్తాంబను కావ్యమవుషు । చేసెనని లక్ష్మణార్యులు చెప్పిరిదియు॥ ౧౯

తా॥ తిరుక్కోవలూరిలో మేష మాసమైన చైత్ర మాసమందుఁ జిత్రా
నక్షత్రమున నవతరించి మధురకవి యాళ్వారు ప్రసిద్ధిఁ బొందెననియు భూ
మిలోని విశేషములఁ జూడవలెనని యుత్తర దేశమందున్న పుణ్య క్షేత్రముల
సేవించుచుఁ దిరిగ ననియు అంతట నమ్మాళ్వా రవతరించుటవలనఁ గలిగిన
దివ్య తేజో రాశి కోటిసూర్య ప్రకాశమును దక్షిణంబునఁ జూచి యతి వేగ

ముగ వేంచేసె ననియు నమ్మాళ్వారిని సేవించి యాతఁడానతిచ్చిన తిరువాయి మొళ్లి మొదలైన ప్రబంధము లధికరించె ననియు ఆళ్వారిని నాచార్యునిగాఁ గైకొని తానుదన్నుఁ బ్రియశిష్యునిగా నిర్ణయించికొనెననియు ఆళ్వారి విషయముగాఁ గణ్ణినుణ్ చిఱుత్తాంబనెడి దివ్య ప్రబంధ మానతిచ్చెనని యు చరమపర్వ నిష్ఠైక పరుఁడై యుండెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( శ్రీ మధురకవి యాళ్వారి వైభవావతార మానతిచ్చి చూడి కుడుత్త నాచ్చియారి యవతార వైభవముమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శ్రీ విల్లి పుత్తూ రజిత కాముఁడగు పెరియాళ్వారి తులసీ వనాంతరమునఁ। ద్రవ్యఁగా నందుసీతయుఁబోలె బాలనైపుట్టి కర్కాటక పుబ్బయందు। నాళ్వారి బిడ్డనై యాత్మను గుణవరుం డచ్యుతుండే యని హరికి నతఁడు। గట్టిన తిరుమాలెక బరివాసించియ శూడికుడుత్తవళ్ శుభగయనుచు। సర్వలోక ప్రసిద్ధనై సరసగోపి। కామకృతిఁదిరుప్పావును నమ్మృతతుల్య। మైనతిరుమొళ్లియను దానెయానతిచ్చె। ననుచు లక్ష్మణమునివరుం డానతిచ్చు॥ ౧౮

తా॥ శ్రీవిల్లిపుత్తూరి యందుఁ బెరియాళ్వారి నందవనములోపలఁ దులసీవనమునఁ దర్విన్యఁగా సీతాపెరాట్టి యవతారమైనటుల నాడిమాసమునఁ బుబ్బా నక్షత్రమందు శూడికుడుత్త నాచ్చారమ్మ యవతరించెననియు పెరియాళ్వారికిఁ గొమార్తెయైన యీ యాత్మకుఁ గల్యాణగుణములు గలిగిన శ్రియఃపతి కర్తయనియు పెరియాళ్వారు కట్టిన తిరుమాలెలు తాను జాతుకొని కొప్పునఁజుట్టిన తిరుమాలెలు పెరుమాళ్లకు నీయఁగా శూడికుడుత్తనాచ్చారమ్మయను తిరునామమాయెననియు సర్వలోక ప్రసిద్ధమై గోపికలకోరికలుకలుగఁ జేసుకొనెననియు తిరుప్పావను దివ్య ప్రబంధమును నమృతమునకుసరియైన నాచ్చారుతిరుమొళ్లినిదానె యానతిచ్చెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శూడికుడుత్తనాచ్చియార్ వైభవ మానతిచ్చి నమ్మాళ్వారి వెనుకటి యాచార్యులను మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఆళ్వారు ఖ్యాతిఁబొందినంత దక్షిణ దిగ్ధరణి నాథపద్మాక్ష రామమిశ్ర। యామునమునిముఖ్యులవతార మొనరించి తత్ప్రబంధార్థసంస్థాపనంబుఁ। జేసెయామున మునిశిష్యులు దిరుమలనంబియుఁ దిరుకచ్చినంబిగారు। తిరుమాలెయాండాను దిరుకోట్టి యూర్నంబినంబియు మఱి పెరియనం

బిగారు । నాదిదేశికులందఱు నరసిచూచి । దర్శనోద్ధారకులువీరె తప్పదను
చు'। సంప్రదాయము రామానుజాహ్వయునకుఁ దెలిపిరని చెప్పెలక్ష్మణ
దేశికుండు॥ ౧౯

తా॥ నమ్మాళ్వారు పరమపదమునకు వేంచేసిన వెనుక దక్షిణ దేశమందు శ్రీమన్నాథమునులును బుండరీకాక్షులను శ్రీరామమిశ్రులును శ్రీయాళవందారును నీమహాత్ములవతారమై యాళ్వారు లానతిచ్చిన తిరువాయిమొళి యర్థములు స్థాపితముఁజేయవలసి శ్రీయాళవందారు శిష్యులు తిరుకచ్చి నంబియు తిరుమాలై యాండాను దిరుక్కోట్టియూరు నంబియుఁ బెరియనంబియుఁ దిరుమలనంబియు నీ మహాత్ములయందా రహస్యములు స్థాపితముఁ జేసిరని యు ఆ యాచార్యులు విచారించి చూచి దర్శనోద్ధారకులు రామానుజులే యిది తప్పదని సాంప్రదాయమైన యర్థములను వారికానతిచ్చిరని లక్ష్మణా ర్యులానతిచ్చిరి॥ (శ్రీమన్నాథముని మొదలైన పూర్వాచార్యులు రామానుజునకు సాంప్రదాయమైన యర్థము లానతిచ్చిరని యానతిచ్చి యా రామానుజుల యవతార వైభవములను మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శ్రీ పెరుంబూధూరఁ జిత్తరయను మేష మాసార్ద్రతారను
మహిజనించి । దర్శనోద్ధారణ తత్పరుండై సారసంగ్రహ దీప భాష్యము
లఁజేసి । వేదాంత తాత్పర్య వేదంబులకుఁ దబ్బిహితపురుషార్థంబు తెలుఁగఁ
జెప్పి । సజ్జనబృందసంశయములెల్లను మాన్పి యవితరలభ్యవిఖ్యాతిఁ బొంది।
యఖిలలోకాత్మసంజీవనాథముగను । నీశభక్తి ప్రపత్తులనెఱుఁగఁజెప్పి కాచి
రక్షించె శ్రీభాష్యకారుఁడనుచు । నానతిత్తురు మాలక్ష్మణార్యులెపుడు॥ ౨౦

తా॥ శ్రీ పెరుంబూధూరను మేష మాసమైన చైత్రమాసమునఁ దిరునార్ద్రానక్షత్రమందెంబెరుమానారు తిరువవతారమాయెనని దర్శనోద్ధారణతత్పరుండై సారసంగ్రహ దీపము మొదలైన భాష్యములుచేసెనని వేదాంత తాత్పర్యమైన రహస్యము తెలుఁగ నానతిచ్చెనని సజ్జనుల సందేహములు మాన్పి తనకుఁదానె కీర్తిఁబొందెనని అఖిలాత్మలకును జీవనాథముగ శ్రియఃపతిభక్తి ప్రపత్తుల నెఱుఁగ నానతిచ్చెనని యీరీతిఁ గాచిరక్షించె శ్రీభాష్యకారుఁడనుచు లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారు నవతార వైభవములానతిచ్చి నమ్మాళ్వారు లెంబెరుమానారు వైభవము బయలుగానాచార్యులకానతిచ్చినారని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఈశ్వరసంబంధ మెఱిఁగించి యాత్మల ముక్తులుగాఁ. జేయ

ముకుపుదలంచి । శఠవైరి యీలోకసంచారమరసి దూకిదిశక్యమాయని యీ యతీంద్రుఁ । డవతరించిన మీఁద నాత్మల నీడేర్చువిధమెల్లఁగని తామెవీరుజ నుల। కాచార్యులని మంగళాశాసనముఁజేసి ముందుగానానాథ మునికిఁ జె ప్ప । వారుదమశిష్యులకుఁజెప్ప వారునట్ల । చెప్పుచునువచ్చి తమకును జీవ నంబు । వీరిసంబంధమున నని వినుతిఁ జేయు । చుందురని చెప్పె లక్ష్మణ యోగివరుఁడు॥ ౨౨

తా॥ నమ్మాళ్వారులు శ్రియఃపతి యొక్క సంబంధ మాత్మలకు నె ఱుఁగించి ముక్తులఁ జేయు నీయకొనక యీ లోకసంచారము మనస్సునఁ జూ చి తమకిది శక్యముగాదని యిఁకమీఁద నెంబెరుమానారవతారమై యీ యాత్మలనీడేర్చునని యావిధమెల్ల నెఱిఁగిరని యా మహాత్ముఁడె జనుల కా చార్యుండని మంగళాశాసనముఁ జేసిరని యీ వివరము శ్రీమన్నాథము నులకానతిచ్చిరని శ్రీమన్నాథమునులు దమశిష్యులకానతీయఁగా వారుతమ శిష్యులకుఁ జెప్ప వారును దమకు నెంబెరుమానారు సంబంధమువలన శ్రి యఃపతి సంబంధముగలిగెనని యెంబెరుమానారును స్తోత్రముఁ జేసిరని ల క్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఎంబెరుమానారు వైభవము పూర్వులను సంధించి యానందముతో నుండిరని యానతిచ్చి యెంబెరుమానారు యొక్క శిర స్సంబంధులును దిరువడిగళ సంబంధులును మోక్షమును బొందిరని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సగరసుత స్వర్గసాధన గంగావ తరణ ప్రయత్నంబు తా ముఁజేసి । యంశుమంతాదులు నడఁగ భగీరథుఁ డొనరించి నట్లుతా నుర్వి లోన । నవతరించి యతీంద్రుఁ డాత్మల నీడేర్చం బూచి తద్దేశికుల్ చోద్య మంది । తమయత్నమిది వీరుతలకట్టఁ జేసి రాయని మహానందంబు నందినపు డె। తమకుఁ గ్రిందటఁమీఁదటఁ దగిలియున్న । దేశికులకెల్ల ముక్తియతీంద్రువల న। నసుచుఁ జెప్పినఁ దప్పేమి యఖిలజనుల । కతఁడె యాచార్యుఁడని లక్ష్మ ణార్యులనిరి॥ ౨౨

తా॥ సగరచక్రవర్తి కుమారులకుఁ బుణ్యలోకమైన స్వర్గలోకములుగ లుగవలెనని వారిసంతతిలోనం శుమంతాదులు మొదలైనరాజులు గంగా నదిని సాధించి తెత్తుమని యనేక ప్రయత్నములుచేసి సాధించలేకమృతిఁబొం దిరనియు ఆపిమ్మట వారివంశమందు భగీరథుఁడు సాధించి యామునుపటివా రెతాతలైన రాజులకు స్వర్గలోక మిచ్చినట్లునియు నా పిమ్మట నీయాత్మలఁ బ

రమపదమందుఁ జేర్చెదమని వేంచేసిన పూర్వులు పెట్టలేక పోయిరనియు ఆవెనుక నెంబెరుమానారు భూమియందవతరించి యీ యాత్మల నీడే ర్చెననియు శిలెని మహిమ లాచార్యులు విని యాశ్చర్యపడిరనియు మనుప టివారు తమయత్నము తమచేతఁ గాకుండఁగా నీమహాత్ముండు తలకట్టుఁ జేసెనని యాపూర్వులు మహాసంతోషము బొందిరనియు తనకు శిరస్సం బంధమునమన్న యాచార్యులకును దన తిరువడిఘుళ సంబంధమున నున్న యాచార్యులకును నెంబెరుమానారు సంబంధమువలనఁ బరమపదము గలి గెనని చెప్పెనేని తప్పుగలదా తప్పు లేదనియు సకల జనుల కతండె యా చార్యుండని లక్ష్మణార్యులానతిచ్చిరి॥

గద్య॥ ఇది ముముక్షుజనకల్పకంబను మహాప్రబంధంబునందు సమష్టి వ్యష్టిసృష్ట్యాది ప్రవర్తకుండైన సర్వేశ్వరుండు తత్తత్కర్మాను గుణంబు గా దేవాది విషమసృష్టి పుట్టించి సదసద్వివేక హేతుశాస్త్ర ప్రధానంబు గాఁజేసి మధ్యస్థ భావంబుననులఁడు ననియును గర్భాది సప్తావస్థలయందును దాపత్రయాభి సంతప్తులై దుఃఖసాగరమగ్నులైన జంతు సంతరణోపాయ మూలంబు భగవత్కటాక్షం బనియును సంసారార్ణవ మగ్నజంతు వైష మ్యమూలంబు దురత్యయ భగవన్మాయ యనియును గర్భభూమిని మనుష్య జన్మాది దుర్లభత్వంబును సకలజనోజ్జీవన మూలభగవద్గుణ జ్ఞానగమన ప్ర కారంబును అచిదవిశేషితాత్మోజ్జీవనార్థంబుగా సృష్ట్యవతారాది వ్యాపా రంబులఁ జేసి వేసారి సర్వేశ్వరుండు ఆళ్వారులఁ బుట్టించెననియును ఆళ్వా రుల సందర్శన స్పర్శన ప్రబంధ వృత్త్యాదులు ప్రత్యేక మోక్ష ప్రదంబులని యును తత్ప్రసంగంబున నవతరించిన మాస నక్షత్ర గ్రామాదివర్ణంబును అఖిలాత్మోజ్జీవనమూల భాష్యకారావతార వైభవ వైచిత్ర్యంబు నన్నది ద్వితీయ ప్రకరణము.

ఇది ముముక్షుజనకల్పకంబునఁ ద్వితీయ ప్రకరణము.

శ్రీమతే రామానుజాయనమః.

## తృతీయ ప్రకరణము.

ఎంబెరుమానారు శిరస్సంబంధులును దిరువడిఘుళ సంబంధులును ముక్తు లయిన క్రమమానతిచ్చి శుకయోగీంద్రుండు మునుపు కలియుగంబున మహాత్ము

లవతారమగునని యానతిచ్చినట్లు మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ కలియుగంబున భూమిఁ గమలాక్షు భక్తులీ ద్రవిడ దేశంబులోఁ
దామ్రపర్ణి । నాదిగాఁగల యనేకాపగా తీరంబులందు సర్వజ్ఞులై యవ
తరింతు । రనినుండుశుకయోగి యానతిచ్చినయట్లు శఠజిన్ముఖులుపుట్టి సక
లవేద । వేదాంగతదుపాంగ వేదార్థములనెల్ల ద్రావిడోక్తిని బ్రబంధములఁ
జేయు । కతననిప్పుడు సర్వాధికారములను । పాఠమాత్రంబు ననె సర్వఫ
లదములును । సమ్యనవి తెలియవలసిన యర్థములను । తెలుపునని చె
ప్పెలక్ష్మణ దేశికుండు॥ ౧

తా॥ కలియుగంబున శ్రియఃపతి భక్తులు ద్రావిడదేశంబులోనఁ దామ్ర
పర్ణి నదీతీరంబు మొదలుగాఁగల యనేక పుణ్యనదీతీరములయందు సర్వజ్ఞు
లై యవతరింతురని శుకయోగి యానతిచ్చి నట్లు నమ్మాళ్వారు మొదలై
నయాళ్వారు లవతరించి రనియు వేదాంత తాత్పర్యార్థములను ద్రా
విడ ప్రబంధములుగఁ జేసిరనియు వారి ప్రబంధముల కతన సర్వాధికారము
గాఁ బాఠముఁ జేసిన మాత్రముననే సర్వఫలముల నిచ్చుననియు తెలియవ
లసిన యర్థములను దివ్యప్రబంధములే తెలుపునని లక్ష్మణార్యు లానతిచ్చి
రి॥ (తెలియవలసిన పరమార్థములను నాదివ్యప్రబంధములు తెలుపునని యా
నతిచ్చిరి ఆప్రబంధము మధురకవులు మొదలయిన మహాత్ములు చదివిరని మీఁ
ద నానతిచ్చుచున్నారు॥

సీ॥ ఆప్రబంధము వలన నప్పుడు శఠవైరి కరుణఁ జెప్పఁగ మధుర
కవులుచదువఁ । దత్ప్రియ శిష్యులై ధరణిలోఁ గొన్నాళ్లు నిలిచి యంతటఁ
బాఠనియతిదప్పి । కడుమాసినను దీర్ఘకాలంబులకు నాథమునియందుఁ దిరు
వాయిమొళియనంగ । వెలసిన పాటలు వేయింటిలోఁ బది యొకఁడు చె
ప్పఁగ వినుచుండివిస్మ । యంబుతోడుత శఠవైరి నాశ్రయించి । కణ్ణినుణ్
శిరుత్తాంబనుకావ్యమువు । జపముగాఁజేసి తత్కృపసకలవాఙ్మ । యంబు
సాధించెనని లక్ష్మణార్యులనిరి॥ ౨

తా॥ దివ్య ప్రబంధములు నమ్మాళ్వారానతీయఁగా శ్రీ మధుర కవి
యాళ్వార్లు చదివిరనియు నీవల మఱియు శ్రీవైష్ణవులు చదువఁగాఁగొ
న్నిదినములు నిలిచియుండెననియు నంతటఁ జదివెడువారు లేక యాప్రబం
ధములనేక కాలములు మాసెననియు ఆదివ్య ప్రబంధమైన తిరువాయి మొ
ళిలోఁబది పాటలొకఁడు చదవఁగా శ్రీమన్నాథమును లవధరించుచు నత్యా

శ్చర్యపడి పూర్వోత్తరవృత్తాంతం బతని నడిగి తెలుసుకొని తిరునగరికి వేంచేసి తిరుప్పుళియాళ్వారు సన్నిధిని యోగబలముచేతను భక్తిచేతను కణ్ణినుణ్ శిరుత్తాంబనెడి ప్రబంధము జపముఁ జేసి నమ్మాళ్వారిని ప్రత్యక్షముఁ జేసుకొనిరనియు వారికృపవల్లన సకలమైన ప్రబంధములను నాలాయిర ప్రబంధములను శ్రీమన్నాథమునులు సాధించిరని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (నశించిన ప్రబంధములు శ్రీమన్నాథమునులు నమ్మాళ్వారి కృపచేతఁ దిరుగసాధించఁ బడెనని యానతిచ్చి బోధాయనాది సమ్మతముగా దేవగానమునఁ ప్రబంధము లన్నియుఁ బాడిరని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ వేదాంత సూత్ర తద్వృత్తి కృద్బోధాయ నాది వైదిక సమ్మతానవద్య। సిద్ధాంత నిశ్చలస్థితి హేతునిజకృతన్యాయతత్త్వాదినిర్ణయము చేత। బాహ్యకుదృష్టి దుర్భాషల నడగించి సన్మార్గవర్తుల శంకలుడిపి। తిరువాయిమొళి తామె దేవగానంబుగాఁ బాడించి సీమలోఁ బ్రబలఁ జేసి। నాథముని లట్లు నిలుపఁగా నాటనుండి। యవనిలోపల నుభయ వేదాంతములను। నిలిచెఁ గాకన్యు లెవ్వరు నిలుపఁగలరె। దేవుఁడతఁడనె లక్ష్మణదేశికుండు॥ 3

తా॥ వేదాంత సూత్రముయొక్క నడత బోధాయనాది సూత్రము వైదికసమ్మతముగా నిశ్చయించి సిద్ధాంతము నిలిపిరనియు అందుకు హేతువు తాము చేసిన న్యాయతత్త్వాదులైన తత్త్వ నిర్ణయములచేత వేదబాహ్యులు మొదలైన కుదృష్టుల దుర్భాషలైన కృతుల నడఁచిరనియు సన్మార్గవర్తులయొక్క శంక లుడిపించిరనియు తిరువాయిమొళిని తామె దేవగానంబుగాఁ బాడించి సీమలోఁ బ్రబలఁజేసిరనియు శ్రీమన్నాథముని లిటువలె నిలుపఁగా నాటనుండియు భూమిలో నుభయ వేదాంతములును నిలిచెననియు అన్యులైన వారెవ్వరును నిలుపలేరు గనుక దేవుండతండని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (శ్రీమన్నాథమునులు దివ్య ప్రబంధములు మాసిపోయినవి యుద్ధరించిరని యానతిచ్చి తమ మనుమలైన శ్రీయాళవందారులకుఁ బ్రసాదించుమని తమ శిష్యులకు మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ ఆనాథముని పౌత్రు లాళవందారును శ్రీరామమిశ్రులు చెప్పనేర్చిరి। పాంచరాత్రాగమ ప్రామాణ్యగీతార్థ సంగ్రహ శ్రీచతుఃశ్లోకస్తవములఁ। జీవేశ్వరజ్ఞాన సిద్ధి త్రయంబును బురుష నిర్ణయశాస్త్రం పూర్వకమును। నెనిమిది గ్రంథంబు లెల్లవారి కెఱుంగఁ జేసి సిద్ధాంత సంస్థితి యొనర్చిరు

యంత యతిపతిఁ జూచి సిద్ధాంతకర్త । యితఁడే! కావలెనని హర్షమిను మడింప । భక్తి నల వరద రాజ ప్రపత్తిఁ జేసి । కోరెనని చెప్పె లక్ష్మణ గురు వరుండు॥ ౪

తా॥ శ్రీమన్నాథ మునులు తమమనుములైన శ్రీ యాళవందారులకు శ్రీరామ మిశ్రులైన మణకాల్ నంబికి నీ ద్రావిడ వేదమును నందలి తాత్పర్యమును నానతీయుమని యనుజ్ఞనిచ్చినందు వలన వేదాంత తాత్పర్యము లానతిచ్చిరనియు శ్రీ యాళవందారు లీ తీరునఁ దాముఁ గోరినఁ గోరిక పెరుమాళ్లమరికఁ జేసిరని యానతిచ్చిన నవధరించి పాంచరాత్రమును నాగమ ప్రామాణ్యమును భగవద్గీతార్థ సంగ్రహమును శ్రీశ స్తవమును జీవేశ్వర జ్ఞానమును సిద్ధిత్రయమును మహాపురుష నిర్ణయమును నిది మొదలుగా నెనిమిది ప్రబంధములు తాము చేసిరనియు నీ శ్రీవైష్ణవ సిదాంతంబు నిలిపిరనియు అంతట నెంబెరుమానారును జూచి సిద్ధాంతమున కితండె కర్తయని సంతోషమినుమడింప వరదరాజ పెరుమాళ్లకుఁ బ్రపత్తి చేసిరనియు నీ మహాత్ముని శీఘ్రమె దర్శనమునకు రప్పించుమని విన్నపముఁ జేసిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( శ్రీయాళవందారు లీలాగు తాము కోరినకోరిక పెరుమాళ్లమరికఁ జేసిరని యానతిచ్చి యెంబెరుమానారు లీ దర్శనమునకు వేంచేసిరని మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ రామానుజులు మంత్రరత్న వేదాంతోక్త నానార్థములు పెరియ నంబివలనఁ । దిరుమంత్రమును జరమ దీపికార్థంబులు నల తిరుకోట్యూరి నంబివలనఁ । దిరువాయిమొళికని దిరుమాలెయాండాను నడిగె నర్థము మూలనురయర నెడి । రంగాధిపునివలన రామాయణార్థంబు నమరిస్తై తిరుమల నంబివలనఁ। తెలిసి దర్శన కర్తలై తిరువరంగ। మందుఁ దాముండి శ్రీ భాష్యమానతిచ్చి । వాదులనుగెల్చి భూమెల్ల వైష్ణవులుగఁ । జేసిరని చెప్పె లక్ష్మణ దేశికుండు॥ ౫

తా॥ రామానుజులు పెరియ నంబిగారి వలన సకల వేదాంతసార భూతంబగు ద్వయము నందలి సమస్తార్థముల నభ్యసించిరనియుఁ దిరుమంత్రమును జరమశ్లోకమును నందలి యర్థములను ననుష్ఠానములను దిరుకోట్యూరి నంబిగారి వలన నేర్చిరనియు తిరువాయిమొళి మొదలైన నాలాయిర ప్రబంధములును దిరువరంగ పెరుమాళ్లరయరు సన్నిధిని జదివిరనియు నందలి వ్యాఖ్యానములు తిరుమాలెయాండాను సన్నిధిని విని నవధరించిరనియు

శ్రీమద్రామాయణము నొకటి పరమార్థనిర్ణయములు తిరుమల నంబిగా రివలన నుపదేశింపc బడిరనియు నీ విధమున సమస్త రహస్యములను నెఱుc గ నవధరించి శ్రీరంగమందుc దాము వేంచేసి యుండి శ్రీభాష్య మానతిచ్చి రనియు సమస్తమైన వాదులను గెల్చి భూమియం దంతట వైష్ణవులుగc జేసిర ని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( ఈ పంచాచార్యులవలన నీ రహస్యములు విన నవధరించి యెంబెరుమానారు నంబెరుమాళ్ల కోవెలలో వేంచేసి యుండిరని యానతిచ్చి వేదాంతసంగ్రహ గ్రంథములc జేసిరనియు నవి యెట్టివన వేదాం త సంగ్రహమును వేదాంత సారమును వేదాంత దీపమును గీతాభాష్యము ను శ్రీభాష్యమును జేసిరని మీcద నానతిచ్చుచున్నారు॥

సీ॥ వేదాంత సంగ్రహ వేదాంతదీపముల్ సారభాష్యమ్ములు సరవిc జేసి। త్రైవర్ణికోక్తసాధన భక్తి వేషంబుc జూపిగద్యత్రయసూక్తివలన। స ర్వాధికారేశ శరణాగతియుcజూపి హరిగీతలకుభాష్య మమరcజేసి। వసుమ తిలో నుడువవు నిత్యమున దేవతారాధనక్రమమానతిచ్చి। దయను వేదబాహ్య ప్రతారణంబు। వలనిభయమునుమాన్చి భూవలయమందు। శారదాసత్కృ తుండయ్యె సరియుcగలరె। నాయతీంద్రునికని లక్ష్మణార్యులనిరి॥ ౭

తా॥ వేదార్థమునకు సమానములైన వేదాంతసంగ్రహము వేదాంతసా రము వేదాంతదీపము గీతాభాష్యము శ్రీభాష్యము ఇవి యానతిచ్చిరనియు బ్రహ్మక్షత్రియ వైశ్యజాతులు మూcటికిని గర్మజ్ఞానభక్తులుగలవని వాటి స్వరూపమ్ముల నానతిచ్చిరనియు సర్వాధికారము శరణాగతరక్షణమని గ ద్యత్రయమానతిచ్చి రనియు భగవద్గీతలకు శ్రీభాష్యముc జేసిరనియు నుడ యవరనెక్కి తిరునామము నిత్యమును గలిగి తిరువారాధన క్రమము మొదలై న గ్రంథము లాఱుcజేసిరనియు వేదబాహ్యుల గెలిచి వారి వలని భయము లేకుండc జేసిరనియు శారదచేత స్తోత్రమంత్రముc జేయcబడినవారని యట్టి మహాత్మునికి సరిగలవారని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( ఎంబెరుమానారు మహిమలును వారుచేసిన గ్రంథములను నానతిచ్చి, కూరత్తాళ్ వారి వైభ వముమీcద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ వైకుంఠసుందర వరదరాజస్తవ మతిమానుషశ్రీ స్తవాదులపుడు। కూరనాథులు సేయc గురుఘుప్పిరాచాఱు వేలుచేసిన తారీ వేదటీక। విమల ప్రసన్నసావిత్రినూత్నం దాది యాళ్వారు కృపc జేయ నమరధనాథు। మితముగాజ్ఞాన ప్రమేయసారంబుల నరుళాళముని చేసె నట్లుమతియు.। ధృఖు

ష్యక్కృచ్ఛిష్యులీ శ్రపపత్తితెలియ । నఖిలజనులకుఁ గాను రహస్యములను ।
నెన్ని యెందఱు సేసిరో యెఱుఁగ వశమె । కొన్ని యివి చెప్పె లక్ష్మణ
గురువరుండు॥ ౭

తా॥ వైకుంఠ సుందరమును వరదరాజ స్తవమును అతిమానుష స్తవమును శ్రీస్తవమును నివిమొదలైన గ్రంథములు కూరత్తాళ్వారు లానతిచ్చిరనియు తిరుక్కురుకైప్పిరాన్ పిళ్లాన్ తిరువాయిమొళికి నాలువేలు వ్యాఖ్యానముఁ జేసిరనియు ప్రపన్నగాయత్రియైన సూత్రందాది కూరత్తాళ్వారుల పురుషాకారముగాఁ దిరువరంగత్తమదునారు లానతిచ్చిరనియు జ్ఞానసారప్రమేయసారము లరుళాళప్పెరుమాళెంబెరుమానారు లానతిచ్చిరనియు నెంబెరుమానారుశిష్యులు శ్రియఃపతియొక్క భక్తిప్రపత్తిస్వరూపము తెలియునటుల సర్వజనులకును రహస్యములుగా నెన్ని యెందఱు చేసిరో యెఱుఁగవశమె కొన్నియీరహస్యము లానతిచ్చిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఎంబెరుమానారు శిష్యుల మహిమలును వారివారిశిష్యుల మహిమలును నానతిచ్చి పెరియభట్టరు వైభవముమీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ కూరేశసుతుఁడాత్మగుణ నిధియగుభట్టరెంబారుదయను సర్వంబుఁదెలిసి । తా రంగరాజసంస్తవము శ్రీగుణరత్నకోశ సహస్రనామ భాష్య । నష్టసుశ్లోకాదు లానతిచ్చియు మాయిదామె మాదవుని వాదమునగెలువ । వెనుక నంజీయరు వేదాంతియనునైన నా మాధవుఁడె వారినాశ్రయించి । యపుడె వారందు నుభయ వేదాంతములను । జదివి తిరువాయిమొళికర్థసరణిమిగుల । విరివిగాఁ దొమ్మిదివేలుచేసి । యనిచెననిచెప్పె లక్ష్మణయోగివరుఁడు॥ ౮

తా॥ కూరత్తాళ్వారి కుమారులు పెరియభట్టరు ఎంభారు నొద్దఁ జదివి సకలవేదాంత ప్రవీణులై సర్వము నెఱుంగ నవధరించిననియు ఆమహాత్ముఁడు శ్రీరంగరాజస్తవమును శ్రీగుణరత్నకోశమును సహస్రనామములకు భాష్యమును నష్టశ్లోకములు మొదలైన రహస్యము లానతిచ్చిరనియు మాయియనెడు మాధవుని వాదమున గెల్చిన నతండె నంజీయరాయె ననియు అప్పుడు వారికి నుభయ వేదాంతములు వినిపించిరనియు తిరువాయిమొళికిఁ దొమ్మిదివేలకు విరివిగాకుండఁగా వ్యాఖ్యానముఁ జేసి నంజీయరుకిచ్చిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( వేదాంతియైన నంజీయరు తిరువాయిమొళికిఁ దొమ్మిదివేల వ్యాఖ్యానముఁ జేసిరని యానతిచ్చి నంబిళ్లను గ

పంజేసిరని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ నంజీయరును వెనుక నంబిళ్ల కృపఁ జేసి యుభయ వేదాంతార్థ యు
క్తిఁజేయ । నతఁడు నాలాయిరమను ప్రబంధబుల యందలి యర్థంబు లాన
తీయఁ । జదివిరా పెరియవాచ్చాంబిళ్లయు వడకు-తిరువీథి పిళ్లయుఁ దెలి
వితోడ । వినివడకు-త్తిరువీథి పిళ్లయుఁ వ్రాసె నవుడీడు ముప్పదియాఱు
వేల । కీడుచెప్మని నంబిళ్లయీయణ్ణి మాధ । వునకుఁ దానప్పుడిచ్చిననా
కరికొకరు । ప్రీతిఁజెప్పిరి నాలూరిపిళ్లఁ దాఁక । ననుచు లక్ష్మణ మునివ
రుం డానతిచ్చు॥ ౯

తా॥ నంజీయరా వెనుక నంబిళ్ల గారిని దమ శిష్యులనుగాఁ జేసుకొని
యుభయ వేదాంతార్థముల నానతిచ్చి సమర్థులఁ జేసిరనియు నాలాయిర
ప్రబంధములు వారుచదివి వ్యాఖ్యానముఁజేసి యర్థము లానతీయఁగాఁ బెరి
యవాచ్చాంబిళ్లయును వడకు-త్తిరువీథి పిళ్లయును దెలివితోడఁ జదివిరని
యువడకు-త్తిరువీథి పిళ్లయు నాలాయిర ప్రబంధమునకు నీడు ముప్పదియా
ఱువేలుచేసి వ్రాసిరనియు నంబిళ్లగారా యీడు చెప్మని యీ యణ్ణిమా
ధవునికిచ్చి రనియు నీతీరున నొకరికొకరు విశ్వాసముతోఁడ నాలూరిపిళ్లదాఁ
కనానతిచ్చిరని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (నంజీయరు నంబిళ్లగారిని గృపఁ
జేసి సకలరహస్యము లానతిచ్చిన నంబిళ్లగారు తిరువాయి మొఴిమొద
లైన నాలాయిర ప్రబంధములకు నీడుముప్పదియాఱు వేలుచేసి వారివారికి
చ్చి ప్రసాదించిరని మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ ఆచార్యతిరునామ మదిచాతినంబిళ్ల యీయణ్ణి మాధవున కీడునీ
యఁ । భక్తితత్వతుఁడు పద్మనాభుఁడు చదివి ప్రియముతో నాలూరిపిళ్లకీ
యఁ । గోలవరాహాఖ్య ఘుస్ఠుఁడా నాలూరిపిళ్లయుఁ దనకతిప్రియ సుతుని
కి । నవనిలో దేవేశుఁడనియు వాచ్చాంబిళ్ళయునియును బరఁగినయతనికీయ ।
నామహాత్ముని యొద్ద నెయాయిపిళ్ళ । శ్రీశ్రీరుమల యాళ్వారు ప్రీతిఁ జ
దువఁ । బెరియజీయరు తిరుమలపిళ్ళఁ జెప్పఁ । జదివెనని చెప్పె లక్ష్మ
ణాచార్యవరుఁడు॥ ౧౦

తా॥ నంబిళ్లగారు తమయాచార్య తిరునామమీ యీయణ్ణి మాధవునికిఁ
బెట్టి యీయీడు ప్రసాదించిరనియు వారును దమకుమారులైన పద్మనా
భులను జదివించిరనియు వారు నాలూరిపిళ్ళకుఁ బ్రసాదించిరనియు వారును
గోలవరాహాఖ్యులకు బ్రసాదించిరనియు వారును దమకుమారులైన ఘు

వేషులకుఁ బ్రసాదించిరనియు వారును బెరియవాచ్చాం బిళ్ళగారికిఁ బ్రసాదించిరనియు నామహాత్ముని యొద్ద ఆయిపిళ్ళ పిళ్ళతిరుమల యాళ్వారులాయీడు చదివిరనియు । తిరుమల యాళ్వారు పెరియజీయరుకు నానతిచ్చిరనియు పెరియజీయరు చదివి సకలమైన యాచార్యులకుఁ బ్రసాదించిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఈయీడు నంబిళ్ళగారినుండి పరంపరగాఁ బెరియజీయరు పర్యంతమును వచ్చి దిక్కుల విస్తరించిరని యానతిచ్చి నడువిల్ తిరువీథిభట్టరు వైభవముమీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ కూరేశ వంశుఁడై కొన్నాళ్ళసూయతోఁ జూచి నంబిళ్ళందసూయమూని । వెరచి నడువిల్ తిరువీథిభట్టరువచ్చి యార్తుఁడై నంబిళ్ల నాశ్రయించి । తిరువాయిమొళి కథాదీపికగా మహాభారత సంఖ్య ప్రబంధమొకటి । వ్రాసి తానంబిళ్ళవద్దఁబెట్టినఁ జూచిపిళ్ళయుఁ జెదలకుఁ బెట్టి విడువ । వెనుకతత్సన్మతిని దత్త్వ వివరణంబు। ప్రీతినష్టాక్షరార్థదీపికయు వ్రాసి। తదనువర్తనశీలుఁడై తత్పరతను । నుండెనని చెప్పె లక్ష్మణయోగివరుఁడు॥ ౧౧

తా॥ కూరత్తాళ్వారి తిరువంశమందు నడువిల్ తిరువీథి బట్టరు నంబిళ్ళగారి యందు నసూయనొన్నాళ్ళు కలిగినవెనుక యాయసూయ పోయెననియు నావెనుక నడువిల్ తిరువీథిభట్టరు నంబిళ్ళగారిని నాశ్రయించిరనియు ఆయాచార్యసన్నిధిని తిరువాయిమొళికి నర్థమానతీయఁగా విని గ్రహించిరనియు అదిమహాభారత సంఖ్యగాఁ బుస్తకమున వ్రాసిరనియు నంబిళ్లగారి సన్నిధిని నా పుస్తకముంచిన నది కటాక్షించి యిది యుండవచ్చునా యని యా పుస్తకము చెదలకుఁబెట్టిరనియు ఆ వెనుక యాచార్య సమ్మతిని దత్త్వవివరణమును దిరుమంత్రమునకు నర్థముఁ జేసిరనియు నంబిళ్ల గారిని సేవచేయుచుండి రని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (నడువిల్ తిరువీథి భట్టరు వైభవ మానతిచ్చి పెరియ వాచ్చాంబిళ్లగారి వైభవము మీఁద నానతిచ్చుచున్నారు।

సీ॥ పెరియ వాచ్చాం బిళ్ల పిళ్లగా రాజ్ఞనె యరుళిచ్చెయల్ కర్థమరసి వ్రాసి । స్తోత్రగద్య త్రయశ్లోక చతుష్టయ శ్లోకద్వయాన్య సుశ్లోకములకుఁ । దత్త్వార్థమభయ ప్రదానాదులకుఁ జెప్పి మఱియును మాణిక్యమాలె తత్త్వ । వివరణ తత్త్వవివేక పరందరహస్యాది కృతులును నానతిచ్చి । బోద్ధృకామ్య పరస్పర బోధకాల । యాపనార్థాను భవముల కాస్పదంబుఁ । జేసిరక్షించె సాత్త్వికజీవకోటి । ననుచు లక్ష్మణమునివరుం డానతిచ్చు॥ ౧౨

తా॥ నంబిళ్లగారి యనుజ్ఞవలనఁ బెరియ వాచ్చాంబిళ్లగారు తిరువాయి మొழி మొదలైన ప్రబంధములకు నిరువదియాఱు నిరువదియాఱు వేలు వ్రాసి యుంచిరనియు శ్రీయాళవందారు స్తోత్రమునకు నర్థమును గద్య త్రయమున కుఁ జతుశ్శ్లోకములకు నర్థమానతిచ్చిరనియు మఱియు శ్లోకద్వయమునకును తని శ్లోకమునకును బూర్వు లానతిచ్చిన శ్లోకములకును దత్త్వార్థమైన యాభ య ప్రదానములకును నివిమొదలైన వాని కర్థముల వ్రాసిరనియు మాణిక్య మాలె తత్త్వవివరణము తత్త్వవివేకము పరందరహస్యములు మొదలైన రహ స్యములఁ జేసిరనియు ముముక్షువులు తమకుఁ దా మానతిచ్చుచు నవుఁ గా ము లేకప్పాటు గను నందుకుఁ గాలక్షేపమున కాస్పదమైన రహస్యాదులఁ జేసిరనియు సాత్త్విక కోట్ల నీలాగున రక్షింతురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (పెరియవాచ్చాంబిళ్లగారి వైభవమానతిచ్చి పిళ్లె లోకాచార్యుల వైభవము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ ఘనులైన పిళ్లలోకాచార్యులు వడకుఁ తిరువీథి పిళ్లతాఁ దెలుపఁ దె లిసి। యాసిని దత్త్వరహస్య త్రయార్థ ప్రకాశక యాదృచ్ఛికాది పళ్లు। వ చన భూషణ తనివ్యాఖ్యానములు తత్త్వశేఖరంబు ప్రమేయ శేఖరంబు। ప్రథి తార్చరాది ప్రసన్న పరిత్రాణ మాదిగానెన్నైన యానతిచ్చి। స్వస్వరూపా నుగుణసాధ్య సాధనములఁ। దెలిపి జనులెల్ల బ్రతికెడి తెరువుఁజూపి। యతిశ యించిన కృపచేత నాత్మనాథు। నాజ్ఞచేతను నని లక్ష్మణార్యులనిరి॥ ౧౩

తా॥ వడకుఁ తిరువీథిపిళ్లగారు పిళ్లలోకాచార్యులకు దర్శన వైభవమా నతియఁగా లెస్సఁ దెలిసిరనియు తత్త్వత్రయమును రహస్యత్రయమును యాదృ చ్ఛికాదిపదులను శ్రీవచన భూషణమును దత్త్వ శేఖరమును బ్రమేయ శేఖర మును నర్చరాది రహస్యమును బ్రపన్న పరిత్రాణమును నివిమొదలుగాఁగల ర హస్యము లానతిచ్చిరనియు తనస్వరూపమునకు నను రూపమైన సాధ్యసాధన మును నిర్హేతుక కృపచేత సర్వజనులకు బ్రతుకవలెనని తెలియునట్లు నాత్మల కు నాథుండైన శ్రియఃపతి యనుజ్ఞచేతను తెరువుఁ జూపిరని లక్ష్మణార్యులాన తిచ్చిరి॥ (పిళ్లలోకాచార్యుల వైభవమానతిచ్చి పెరియ జీయరైన మణవాళ మహామునుల వైభవముమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ పిళ్ల లోకాచార్య పెంపునఁ గూరకులోత్తము దాసార్యు లాన రఁ జెప్పఁ। దిరుమలయాళ్వారు దేశికుఁడై వరవరయోగికెని దమ వైభవంబు। నానతిచ్చినయార్తి యతిరాజవింశతి రత్నంబు నుపదేశరత్నమాల। తిరుఖు

యు మొదలగు శ్రీకర్త దీపికం బాదియు వచన భూషణాల సద్వ్యాఖ్యాకృతులును । జేసి న
రులెల్లదను బెరియ జీయరనఁగ । నఖిలలోక ప్రసిద్ధుఁడై యాయతీంద్రుఁ । డితఁ
డు కాఁబోలునన గుణ వితతచేత । నొప్పెననిచెప్పె లక్ష్మణయోగివరుఁడు॥ ౧౪

తా॥ ఈ రహస్యములు పిళ్లెలోకాచార్యులు రచించుకొన్న కుమారులు కూరకులోత్తము దాసార్యుల కానతిచ్చిరనియు కూరకులోత్తమ దాసుల వలనఁ దిరుమల యాళ్వారు సకల రహస్యము లధికరించిరనియు పెరియ జీయరుకు రహస్యార్థములానతిచ్చి దర్శన వైభవ మానతిచ్చిరనియు అప్పుడు పెరియ జీయరు ఆర్తిప్రబంధము యతిరాజ వింశతియు - నుపదేశ రత్నమాలయును- తిరువాయిమొళికి సులభార్థముగ నంబాదిదీపికను జేసిరనియు శ్రీవచనభూషణమునకు వ్యాఖ్యానముఁ జేసిరనియు నరులెల్లఁ దమ్ముఁ బెరియజీయరని యఖిల దేశములయందును బ్రసిద్ధిఁ బొందిరి యాయెంబెరుమానారే వీరు తప్పదనునటుల సకలగుణములు గలిగి యొప్పియుండిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( పెరియజీయరు వైభవ మానతిచ్చి పిళ్లెలోకాచార్యుల తమ్ముఁడు అళగియమణవాళ నాయనారను మహాత్ముని వైభవముమీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ ఘనబుద్ధిపిళ్లెలోకాచార్యునను జన్ముఁ డఖిల విద్యాశాలి యాటఁ జే
సి । తాకణ్ణినుణ్ చిరుత్తాంబుఁ దిరుప్పావునను వీని వ్యాఖ్యాన మానతిచ్చి ।
చతురతో నరుళిచెయులు రహస్యంబు నాచార్య హృదయంబు నాదిగా
ను । గొన్నిప్రబంధముల్ గూర్చి ముముక్షువులైన వారవి చూచి హర్షమం
ద । నభిజనాదుల తారతమ్యములఁ జూపి । కర్మకైంకర్య విషయ తత్క్రమవి
శిష్ట । వేషనిషఃకృష్ట వేషముల్ విశద పఱచి । తెలిపె ననిచెప్పె లక్ష్మణ
దేశికుండు॥ ౧౫

తా॥ అళగియ మణవాళ పెరుమాళ్ నైనారను మహాత్ముం డఖిల విద్యలను దండ్రిగారివలన నేర్చిరనియు తాముకణ్ణినుణ్ చిరుత్తాంబని మొదలగు ప్రబంధములకును దిరుప్పావుకును వ్యాఖ్యాన మానతిచ్చిరనియు నరుళిచ్చెయుల్ రహస్యమును నాచార్య హృదయమును నివి మొదలైన రహస్యములు ముముక్షువులైన వారు చూచి సంతోష పడునటులఁ జేసిరనియు నభిజన విద్యావృత్తములకుఁ దారతమ్యములఁ జూపిరనియు కర్మము కైంకర్య విషయమాయెననియు నుత్కృష్ట నికృష్ట వేషములకు నేర్పాటుగా విశదపఱచిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( అళగియ మణవాళ పిళ్లెగారి వైభవ మానతిచ్చి ... ప్రపదపాద దేశికులైన నైనారాచ్చాన్ పిళ్లెగారు తమ కుమారునికిఁ

పెరియ వాచ్చాంబిళ్ల గారి తిరునామముంచి యా మహాత్ముని వైభవము మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ పరమదయా భయప్రద రాజ పుత్రుని పెరియ వాచ్చాంబిళ్ల పేరు వెట్టి । యాయనకిచ్చిన నతఁడు తత్పుత్రుఁడై నైనారు కొన్ని యున్నతిని జేసె । జ్ఞానార్ణవము తత్వసంగ్రహంబును ముక్తభోగావళియు ననభూమి వెలయు । వరవరమునియన వాదికేసరియన నైనారుశిష్యులై నరులుపొగడఁ । దత్వ దీపంబునరయ నధ్యాత్మచింత । తత్వదీప ప్రకాశము తత్వదీప । సంగ్రహంబును మొదలుగా సంఖ్యమైన । లానతిచ్చిరి మా లక్ష్మణార్యులనిరి॥ ౧౬

తా॥ అభయ ప్రద పాదులైన నైనారాచ్చాం బిళ్లగారి కుమారునికిఁ పెరియ వాచ్చాంబిళ్ల గారి తిరునామమిడి సకల రహస్యము లానతిచ్చిరనియు వారి కుమారులు కొన్నిరహస్యములఁ జేసిరనియు నవి యేవియన జ్ఞానార్ణవమును దత్వసంగ్రహమును ముక్తభోగావళియు నివి భూమిని వెలయునటులఁ పెరియజీయరును వాదికేసరియును వీరిద్దరును నైనారు సన్నిధిని జదివిరనియు వీరిద్దరిలో వాదికేసరి నైనారుకు శిష్యులైన నరులు పొగడఁగాఁ దత్వ దీపమును నధ్యాత్మ చింతయును దత్వ దీప ప్రకాశమును నివి మొదలుగాఁగల యసంఖ్యమైన రహస్యములను నానతిచ్చిరని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥

(నైనారాచార్యుల శిష్యుఁడైన వాదికేసరి వైభవమానతిచ్చి తిరువాయిమొఴి పిళ్లగారి ప్రభావంబు మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ మునుపుడాఁ దిరువాయిమొఴికి నాచార్యుఁడై పిళ్లయు నాఁ డీపు ప్రియముతోడఁ । జదివి నాలూరి యాచ్చాం బిళ్లగా నానతీయఁగా సర్వంబు తెలిసి వెనుక । దృఢచిత్తుఁడై విరోధి పరిహారంబును గురు పరంపర మహిమగురుతుగాను । నానతిచ్చెను నిలిచి యాదవగిరిమీఁద సుర తరువనఁ గృష్ణ సూనుఁడట్లు । ఘనుల వార్తలు మాలిక గానొనర్చి । హృద్యముగఁ జేసి సుజనుల కాద్యసరణి । గానుపించఁగఁ జేసెను గరుణతోడ । ననుచు లక్ష్మణముని వరుం డానతిచ్చు॥ ౧౭

తా॥ తిరువాయి మొఴికి నాచార్యులైన తిరువాయి మొఴి పిళ్లగారు తాము నాలూరాచ్చాంబిళ్ల గారి సన్నిధిని జదివి సర్వమును నెఱిఁగిరనియు దృఢచిత్తుఁడై విరోధి పరిహారమును గురుపరంపరా గౌరవమును పూర్వాచార్యుల వార్తలు శ్రీవార్త మాలికగా నివి యానతిచ్చిరనియు సెల్వ పిళ్లరాయ సన్నిధిని యాదవాచల మందుఁ గల్పవృక్షమున్నటుల తిరువాయి

మొళ్ళి పిళ్లగారు వేంచేసి యుండి సుజనులైన వారికి నత్యంత కృపచేత నా
ద్యంతములు తెలియు నటుల తోవఁ జూపిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( తి
రువాయిమొళ్ళి పిళ్లగారి వైభవ మానతిచ్చి పట్టరపిరాన్ జీయరి వైభవ
మునీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ భాష్యకారాంఘ్రి సద్భక్తుఁడై తగు తిరుప్పాళి గుడిజీయరు బోధవ
లన । నాఁడుపిళ్ బళఘియనయినారు గురుపరంపర వైభవముఁ దానె బయ
లుపఱచి । వరయోగికృపను బట్టరుపిరాన్ జీయరు నంత్య మోపాయ నిష్ఠా
నతిచ్చి । దయచేయఁగాఁగదా తత్వ హితార్థముల్ కని భాగ్యవంతులీ కలి
యుగమున । బ్రహ్మరుద్రాద్య శక్య తద్భగవదంఘ్రి । కమలసాధన సా
ధ్యైకగమ్య విమల । శాశ్వతానంద మయపద స్వామ్యములగుదు । రనుచు
లక్ష్మణమునివరుం డానతిచ్చు॥ ౧౭

తా॥ పిళ్‌బళఘియ్యె మణవాళ జీయరు గురుపరంపర వైభవము తామె
బయలు పఱచిరనియు పెరియజీయరు కృపనుబట్టరు పిరాన్ జీయరు అంత్య
మోపాయనిష్ఠ నానతిచ్చిరనియు తత్వహితమైన యాయర్థములఁ గనుఁ గొ
ని యీ కలియుగమున భాగవతులు కడతేరవలెనని యానతిచ్చిరనియు బ్ర
హ్మరుద్రాదులకును గనఁగూడని శ్రియఃపతి విగ్రహమును నతని తిరువడి ఘ
ళును నీ మహాత్ములు కందురనియు సాధ్య సాధనంబులఁ బొందఁ బడిరనియు
నిర్మలమై నిత్యమై యానందమైన పరమపద మేలుదురని లక్ష్మణార్య లాన
తిచ్చిరి॥ (పట్టరుపిరాన్ జీయరు వైభవమానతిచ్చి శ్రీభాష్యముపరంపరముగా
వచ్చిన విధమునీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ వేదాంత సూత్ర తద్వృత్తులు శోధించి తత్వార్థమున్నట్టె తాము
తెలిసి । శ్రీభాష్యకారులు చెప్పఁ గురుఘప్పిరా నతని వలనను నెంగళాళు
వారు । అందునడాదూరి యమ్మాళును లభించె నందుఁ జదివెకిడాంబి యప్ప
ళార్య । ప్రేమతోఁ దూప్పూరిపిళ్లయు వారందుఁ జదివె నైనారను స్వతన
యునికి । భక్తితోఁ జెప్పవారు శ్రీభాష్యవట్ల । తెలిపి రీరీఁ బ్రతివాది భీభ
యంక । రాదులకు వారు చెప్పంగ నవనిలోన । నుండె ననిచెప్పె లక్ష్మణ
యోగివరుఁడు॥ ౧౮

తా॥ వేధాంత సూత్రమును తద్వృత్తులను శోధించి తత్వార్థమును
మున్నట్టె తాము తెలిసిరనియు నెంగళరుమానారు అప్పుడు శ్రీభాష్య మా
నతిచ్చి రనియు శ్రీభాష్యము కురుఘప్పిరా నారుకు నానతిచ్చి రనియు వా

రుమేంగళాళు వారలకు నానతిచ్చిరనియు వారు నడాదూరి యమ్మాళుకు నానతిచ్చిరనియు వారు కిడాంబి యప్పుళార్యుల కానతిచ్చిరనియు వారు తూపూరిపిళ్లగారి కానతిచ్చిరనియు వారు తమ కుమారులైన నైనారులకు నానతిచ్చిరనియు నీరీతిఁ బరంపరగా శ్రీభాష్యము వచ్చెననియు ఆనైనారు ప్రతివాది భయంకరాదులైన వారికి నానతియగా భూమిలోన నిప్పుడు నిలిచెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శ్రీభాష్యము వచ్చిన పరంపర యానతిచ్చి యద్దంకి సింగరాచార్యుల మహిమమీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ ఆయిచే శిక్షితులైనయా తిరుమలనంబిగారికి వీరునప్తృలనియు । వరవరమునిమనోవల్లభతత్కృపా స్పదసింగరాచార్య పౌత్రులనియు । జ్ఞానభక్తివిరక్తి సంశయాత్మాశ్రిత బుధవేంకటాచార్య పుత్రులనియు । నద్దంకి నిత్యవాసాశ్రిత కల్పక సింగరాచార్యుల సేవఁ జేసి । తత్త్వదర్శితభాష్య కృద్దాసుఁడగుచుఁ । జాటఁజేయు విశేష ప్రబంధములను । నాయతీంద్రుని విషయమైయానతిచ్చి । లక్ష్మణార్యులు తామొక లక్షగలవు॥ ౨౦

తా॥ మణవాళమహాముని ఆయుసన్నిధిని జరుపుకొనుచుండిన పెరియజీయరుకృపకుఁ బాత్రులైన పెద్దసింగరాచార్యులకు మనుమలనియు జ్ఞానభక్తిగల వెంకటాచార్యుల కుమారుండనియు నద్దంకియనియెడి దివ్యదేశమందు నిత్యవాసమై తమయాశ్రితులకుం గల్పవృక్షమైయున్న చిన్న సింగరాచార్యుల సేవఁ జేసిరనియు తత్త్వదర్శనము చేసిన శ్రీభాష్యకారుల దాసుండగుచు నెంబెరుమానారు జీయరు- ఎంబెరుమానారు విషయమైన ప్రబంధములలోనున్న రహస్యములు తిరునామములుగాఁ జేసి సంగీతములుగాపించినది యొక లక్షగలవని లక్ష్మణార్య లానతిచ్చిరి॥ (ఎంబెరుమానారు జీయరు వైభవమానతిచ్చి యర్థపంచక తాత్పర్యము మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ తనకన్న నీచుఁడా తలను లేఁడని యెఱుఁగుటది తన్నెఱుంగుట కవధిఁ గనుట । యాచార్యుఁడే దైవమని యెఱుఁగుట పరునాకార మెఱుఁగుట కవధిఁగనుట । యతిసాధనము వైష్ణవాభిమానమె యనుటాత్మ హితంబున కవధిఁగనుట । కడు వాత్మకిలనాశకములహమ్మమతలేయని యెఱుంగుట విరోధ్యవధిఁ గనుట । యెందు వైష్ణవ సంతోష హేతుదాస్య । మధికమనుటయె ఫలమునకవధిఁ గనుట । సత్యమిదియని యర్థపంచకము నెఱుఁగఁ । దెలిసి చెప్పును లక్ష్మణ దేశికుండు॥ ౨౧

తా॥ తనకన్నఁ గోపువమైనవాఁడు లేఁడని యెఱుఁగుట యది తన్నుఁదా

నెఱుంగుట కడఁగనుటయనియు ఆచార్యుడే దైవమని వెఱుంగుట శ్రియఃపతిస్వరూప మెఱుంగుటకుఁ గడఁ గనుటయనియు నీ యాత్మకు హితమైన ఫలము శ్రీవైష్ణవాభిమానమె యతిసాధన ఫలమని వెఱుంగుటకుఁ గడఁగనుటయనియు ఈ యాత్మకు నాశము కలహమ్మమతలే విరోధములని వెఱుంగుటకుఁ గడఁగనుట యనియు నందును శ్రీవైష్ణవసంతోష హేతువైన వాస్యాధికమనుటయే ఫలమునకుఁ గడఁగనుట యనియు సత్యమిదియని యర్థపంచకము నెఱుఁగఁ దెలిపిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥

సీ॥ గురుపరంపరనుండు గుహ్యార్థమని యిది శ్రీహరినుండి వచ్చిన విధమును। దన్మధ్యవర్తి ప్రధానదేశికులను దత్తత్ప్రభావంబు తగ నెఱింగి। యుపకారకోత్తారకోన్నతదేశికునిందు లోపల నిశ్చయించి యతని। యాథాత్మ్యమునుగని యపతలివతలివారు తన్నిష్ఠులై యుంట తగునె యనుచు। నరసిమంత్ర పద త్రితయార్థములకు। విషయ మాతండెయని లోక విశ్రుతముగఁ। జరమ పర్వాధికారుఁడై చతురుఁడగుచు। నుండు నెప్పుడు లక్ష్మణయోగివరుఁడు॥ ౨౨

గద్య॥ ఇది ముముక్షుజనకల్పకంబును మహా ప్రబంధంబు నందు గురుపరంపరావతారక్రమంబును తత్తదుక్త ప్రబంధవిశేషకీర్తనంబును జేయుచుఁ దొల్లిశుకయోగి భాగవతపురాణముఁ జెప్పుచుఁగలియుగంబునఁ దామ్రపర్ణి నదీతీరంబున ద్రావిడదేశంబులో నారాయణ పారాయణులు తిరువవతరింపఁగలరని సూచించుటఁ జేసి శఠారిప్రభృతులు తిరువవతరించి వేదవేదాంతగోప్యాంగార్థములెల్లఁ బ్రబంధములుగాఁ జేసిన ప్రకారంబును నాళ్వారికృపను శ్రీమన్నాథమునులు సకలార్థంబులును లభించి యుభయవేదాంత స్థాపనంబుఁ జేసిన ప్రకారంబును నాథముని పౌత్రుఁడైన యామునముని తచ్ఛిష్యులైన మణక్కాల్ నంబివలన సర్వజ్ఞుఁడై ప్రబంధార్థ నిర్మాణంబుఁ జేసి సిద్ధాంత స్థాపనంబుఁ జేసిన క్రమంబును నా యామునమునిశిష్యులయిన పెరియనంబిప్రభృతుల వలన సకాలార్థంబులు నెఱింగి శ్రీరామానుజులు దర్శనస్థాపనార్థంబుగా శ్రీభాష్యాది శాస్త్రంబు లానతిచ్చిన ప్రకారంబును వెనుక కూరేశ్వరాదుల సకలజనోజ్జీవ నార్థంబుగాఁ గ్రమంబుననానతిచ్చిన ప్రబంధవిశేష కీర్తనంబును లక్ష్మణార్య నిష్ఠాప్రకారంబును నర్థపంచకసారసంగ్రహంబునన్నది తృతీయ ప్రకరణము॥

అచ్యుతశఠకోప యతిరాజ వర వరముని నిజ గురుభ్యోనమః.



శ్రీమతే రామానుజాయనమః.

## చతుర్థ ప్రకరణము.

ఈపూర్వాచార్యుల రహస్యముల నానతిచ్చి గురుపరంపర ముత్యాలకంఠమాలికగా నావలివలి వారినిగూర్చి మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ ముక్తాకృతిఖ్యాత మోహన గురుపఙ్క్తి మధ్యస్థితానర్ఘ్య మణివి
ధమున । సంయమీంద్ర శ్రీవిశాల రత్నంబును దదుభయ పార్శ్వసంస్థాన
ములను । బద్మరాగశ్రీల భాసిల్లు శఠవైరి సౌమ్యజామాత్రాఖ్య సంయ
ములను । నాద్యంత సిద్ధనిజాచార్యలక్ష్మేశ పూరితంబగు కోలికి పూసగలి
గి । హారయష్టియుఁబోలె హృద్యంబునగుచుఁ । బుణ్యకృజ్జనమానస భూష
ణంబు । నైనగురుపఙ్క్తి నెఱుఁగని యధముఁడెట్లు । ముక్తుఁడౌనసె లక్ష్మ
ణమునివరుండు॥ ౧

తా॥ గురుపరంపర యనెడు ముత్యాలకంఠమాలికకు నెంబెరుమానారు ననర్ఘ్యమైన నాయక రత్నముగాను రెండు పార్శ్వస్థులను శిరస్సంబంధమందు నమ్మాళ్వారులును దిరువడిఘళ సంబంధమందుఁ బెరియజీయరును వీరిద్దరును బద్మరాగపు మణులుగాను ఆదిని శ్రియఃపతియుఁ దుదను సదాచార్యుఁడును నీ రెండు తెగలుకొలికి పూసలనియు నిది కంఠమాలికగాఁ బరమపుణ్యులు కూర్చినది మనస్సుకు భూషణమైన గురుపఙ్క్తియనియు నిట్టి గురుపఙ్క్తి నెఱుఁగని యధముండెటువలె ముక్తుఁడగును ననఁగాఁ లేఁడు గనుక యవశ్యమును దర్శనజ్ఞులెఱుఁగవలెనని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ ( గురుపరంపర మనస్సుకు భూషణముగా నానతిచ్చి శ్రీవైష్ణవుల మహిమలు మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ స్వాచార్యసుందర జామాతృభాష్యకృ చ్ఛఠకోప లక్ష్మేశ చరణ
యుగళ । సాధ్యసాధనభావ సరస పరస్పర క్రయవిక్రయార్హ సంఘటిత
భగవ । దనుభవకైంకర్య యాపితానాగత కాలాభిమానార్థ కామరహిత ।
బహువిధప్రఖ్యాతపరదోషనిజగుణవీక్షణజాత్యంధవిగతదోష । సర్వభూతద
యాపరశమదమాది । సకలగుణపూర్ణ నిశ్చలచారుహృదయ । వైష్ణవోత్త
మజన సహవాసులగుచు । నుండుడని చెప్పె లక్ష్మణయోగివరుఁడు॥ ౨

తా॥ తనయాచార్యుఁడును బెరియజీయరును నెంబెరుమానారును న

మ్మాళ్వారులును శ్రియఃపతియు నీ మహాత్ముల తిరువడిఘళు సాధ్యమును సాధనమును దామేయని యెవ్వరుండుదు రనియుఁ బరంపరలకుఁ దాము క్ర య విక్రయములకు యోగ్యులై యుందురనియు శ్రియఃపతియొక్క యనుభవమునకుఁ యోగ్యమైన కైంకర్యమునకు నొడఁబడినవారై యర్థకామరహితులై యున్న దినములు కాలక్షేపముఁ జేసుకయుందురనియు పరులదోషములు బహువిధములుగాఁ వినంబడిన నదితామువూచి మంచినడతయనియు తన నడత యధికమైయుండినఁ గొంచమనియు నీ రెండును జూడక ఘట్టిగ గుడ్డిగాను గోపము పోఁగొట్టవలెననియు సకల భూతములయందును బరమదయాళుత్వము కలిగియుండుదు రనియు శమదమాది గుణములు మొదలైన సకల గుణములు పొందుకొనియుఁ జలనములేని మనస్సులుగల శ్రీవైష్ణవోత్తముల సహవాసము కలిగి యుండుఁడని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శ్రీవైష్ణవ లక్షణగుణముల నానతిచ్చి గురుపరంపర యందుఁ గేవలము కావలసి యనుసంధించేడి వారయినను గురనీమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ పంచ క్రియాన్వితే పంచ భూతంబులఁ జేర్చిన దేహంబు సృష్టిలేశ। జీవాత్మతోఁ బ్రవేశించి సర్వేశ్వరుం డప్పుడు నామరూపాధిపులఁ। జేసి నట్లప్పుడు శ్రీశఠపరాంకుశ యతిరాజ వరవరాహ్వయులగురుల।నన్యోన్యసమ్మిళితైక్యంబులఁజేసి తానాలోఁ బ్రవేశించి నాకుదైవ। మాత్మపర్యంతనామదాస్యాయురూప। రూపములఁ జేసె భవములఁ బాపఁ దలఁచి। సాధనంబును సాధ్య మోక్షాది ఫలము। లన్నియును నీరెయని లక్ష్మణార్యులనిరి॥ 3

తా॥ శ్రియఃపతి సృష్టించువేళఁ బంచభూతములఁ గూర్చి యొకదేహముఁజేసి యందును జీవాత్మను బ్రవేశింపఁజేసి తానంతర్యామియై యుండి యాత్మలకుఁ బేరును రూపమును గలుగఁ జేసి నట్లిప్పుడు శ్రియఃపతిని నమ్మాళ్వారులును నంబెరుమానారును బెరియ జీయరును సదాచార్యుఁడును నీమైనురుని నొకటిగాఁ జేసి దాసునిలోఁ దాముగ బ్రవేశించి దాసునికి దైవమై యాత్మ పర్యంతము దాస్యమునకు ననురూపమైన గుణములును నడతలును గలుగఁ జేసిరనియు మహా పాపములు పోఁగొట్టుదురనియుఁ జలనములేని యొకటియయిన యర్థమును నన్నియును వీరయని నిశ్చయమైన సాధ్యమును సాధనమును మోక్షఫలములును నీ మహాత్ములేయని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (గురు పరంపరయందయిదుగురిని నేకముగాఁ గూడ నానతిచ్చి ప్రత్యక్షముగా ననుభవ మగునట్లు మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ అవియెపో పంచ మహా పదార్థంబులు సరసులకివియె పంచామృతములు । భూతేంద్రియ ప్రాణభోగ్య పంచకములు పంచోపనిషదాఖ్యంబరంగునవియె । పాలును జేనెయుం బంచదారయు నేయి నమృతంబునంబడు నవియునవియె । యచ్యుతశఠకోప యతిరాజ వరవరముని జగురులనువస్తువిదయమెఱింగి । యనుభవింపంగ నేర్చిన యార్యవరుల । కనుచు సర్వంబు నీరసమనును విడచి । తారకాదులు వీరెకాదలంచియెపుడు । నుందు మదమున లక్ష్మణ యోగివరుండు॥ ౪

తా॥ ఆ యయిదుగురును బంచ మహాపదార్థంబులనంబడుననియు జ్ఞానాధికులైన పెద్దలకునవి పంచామృతములై యుండుననియు పంచమహాభూతములును సుభయేంద్రియములును బంచప్రాణములును భోగ్య పంచకములును బంచోపనిషన్మైన విగ్రహమా యెననియు అవియె ట్టివసంగాం చాలు తేనె పంచదారనేయిఫలమును నీనైమెనునుగూడంగాం బంచామృతమనియు అటువలెనే యచ్యుత శఠకోప యతిరాజ వరవరమునులును సదాచార్యుడును నీవస్తువులనిర్ణయమెఱింగి యనుభవింపనేర్చిన యార్యులకుంగాని దక్కినవారికి దొరకదనియు నీయమృత మనుభవించెడి పెద్దలు తక్కిన సమస్తమును రుచిలేనిపదార్థమనియు నీయాత్మకుం దారకాదులు వీరెకాయని తలంచి సంతోషముతో సెప్పుచుండుదురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( గురు పరంపర యందుంగలిగిన శ్రియఃపతి నమ్మాళ్వారు- ఎంబెరుమానారు పెరియ జీయరు నిజగురువు అను నీయయిదుగురిని బంచామృతముగా నానతిచ్చి యయిదుగురి యభీష్టమును నేకముగానే మీంద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సవిభూతిక శ్రీకసంస్థాన మానస వకుళ భూషణ నిత్యవాస హృదయ । భాష్యకారతదీయ భక్తకూరేశాది సంతోషజకర స్వాంతదేశ । వరవరశ్రీశైలవంశ నృసింహాది విశ్రమస్థలమనో విమలసదన । పంచకృష్ణస్థలి పాలన విఖ్యాత కల్యాణగుణగణా కాంతిలోక । లక్ష్మణాచార్య లోకవిలక్షణార్య । సేవితానంత నిర్భర శేషశయన । విభవవిశ్రుత వేదాంత వేద్యచరిత । నీవు నామానసంబున నిలువందగును॥ ౫

తా॥ అఖిలైశ్వర్య సంపన్నుండైన శ్రియఃపతి నమ్మాళ్వారి హృదయంబున నిత్యవాసుండై యుండె ననియు - అట్టి నమ్మాళ్వారు ఎంబెరుమానారు జీయరు హృదయములోపల నిలిచిరనియు - ఎంబెరుమానారు కూరేశాదులంగూడి పెరియజీయరు హృదయమున నిలిచిరనియు । ప్రఖ్యాతముగా

నట్టి పెరియజీయరు అద్దుకి సింగరాచార్యుల హృదయమునులో నిలిచి రనియు వారు తిరుక్కోవలూరు గ్రహించి కల్యాణగుణములు గలిగిన యెంబెరుమానార్ జీయరు హృదయమున నిలిచిరనియుఁ బెరుమాళ్ళకు మహోత్సవములు గలుగఁజేసి వేదాంత వేద్యచరితుండవు గనుక మీరు దాసుని మనస్సులో నిలువఁ దగునని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (సకలాచార్యుల పూర్తి సదాచార్యుల యందుఁగలదనియానతిచ్చి యాయర్థ మేమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ సర్వేశ్వరుఁడు సర్వసంపత్సమేతుఁడై శఠవైరి మానసస్థలి లభించె। శఠవైరి నిజకర చరణాదికములతో యతిపతి హృదయ సంగతి మించె। యతిపతి కూరేశ్వరాది సద్గురులతో వరవరమునిమనోవసతినిలిచె।వరవరమునిభృత్య వర్గంబుతోఁగూడి లక్ష్మణార్యస్వాంతలక్షుమయ్యె। నట్టి లక్ష్మణముని నున్ను నాదరించి। చిత్తదోషంబులెల్లను జెఱచితనకు। వసతిగాఁజేసుకొనినిల్చె వదలఁడింకను। భయములేదెందు మాకు నిర్భరతఁజేసి॥ ౬

తా॥ శ్రియఃపతి సర్వ సంపదలతోఁ గూడి నమ్మాళ్వారి హృదయమందు నిలిచిరనియు ఆనమ్మాళ్వారు తమ యవయవములతోఁ గూడ నెంబెరుమానారు చిత్తంబున నిలిచి రనియు ఎంబెరుమానారు కూరత్తాళ్వారులు మొదలైనగురువులతోడఁ బెరియ జీయరు మానసంబున నిలిచి రనియుఁ బెరియజీయరు తమదాసులతోడఁగూడి యెంబెరుమానారు జీయరు మనస్సున నిలిచిరనియు అట్టి పెద్దస్వాములు దాసునియందు నిలిచి యాదరించి మనోదోషములఁ బోనడచి తమకు నెలవుగా నుండుటకు నొకస్థలము చేసికొని యేలెను గనుక యింకవదలఁడు రక్షించును దాసునికి భయములేదని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (గురుపరంపర సారమీలాగున నెఱింగియుండిన పెద్దలనానతిచ్చి యెంబెరుమానారు వైభవ మెఱుంగవలెనని మీఁద నానతిచ్చుచున్నారు॥

సీ॥ ఎంబెరుమానారు నెఱిఁగి సేవించెడి పెద్దలుకొందఱీ పృథివిలోనఁ। గూరేశు లెంబారు కురుకేశు లరుళాళ రాండాన్ వడుగనంబి యమునానారు। శ్రీభట్టరట్లనం జీయరునంబిళ్ళ విళివడక్కు తిరువీధిపిళ్ళ। పెరియవాచ్చాంబిళ్ల పిళ్ళలోకాచార్య లళగియ మణవాళ పెట్లనఁజీయరుఁ। జరమస్థాలు వాదికేసరి ప్రభృతులు। ఘనులు తిరువాయి మొళిపిళ్ళగారు పెరియ। జీయరటుమీఁదఁ దిరుమల సింగరార్య। లక్ష్మణాచార్యులని లక్ష్మణార్యులనిరి॥ ౭

తా॥ ఎంబెరుమానారును నెఱింగిసేవించెడు పెద్దలుకొంద ఱీభూమిలోఁ

గలవనియు వారెవ్వరసంగా నేత్పాటుగా నానతిచ్చుచున్నారు కూరత్తాళ్వారులును నెంబారులును దిరుక్కురు కప్పిరాణ్ పిళ్ళానును నడుళాళ్వరునూ శ్రీ.బెరుమానారును మొదలి యాండానును వడుగనంబి గారును దిరువరంగ త్తముధనారును శ్రీ భట్టరును నంజీయరును నంబిళ్ళ గారును వడక్కు త్తిరువీథి పిళ్ళగారును బెరియ వాచ్చాంబిళ్ళ గారును బిళ్ళలోకాచార్యులును నళఘియ మణవాళ్ళ జీయరును మఱియుఁ బరమనిష్ఠాపరులైన వాదికేసరి మొదలైన మహాత్ములును దిరువాయిమొళి పిళ్ళగారును బెరియ జీయరటుమీఁదఁ దిరుమల సింగరార్యులును నస్మదాదులకు · నాచార్యులని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( ఎంబెరుమానారును నెఱింగిన పెద్దల నానతిచ్చి యెంబెరుమానారు విగ్రహమును నమ్మాళ్వారి విగ్రహమును శ్రీ వైష్ణవులకు నుద్దేశ్యమని మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ ఈపదుగు రాళ్వారు లీశ దత్తజ్ఞాను లేక కంఠులునైన నిందు లోన। శఠవైరి కవయవసమ పరతంత్రులు కడమవారును మధుర కవులు న నుచు। నాచార్యులగు నాథయామున నాధులకు నుత్తారకుల్ దర్శనోద్ధారకులు ను। యతిరాజులని వారికందఱికెలిగాను నీయిద్దరిని బూర్వులెఱిఁగి కాదె। యన్నితిరుమాళిగలను నమ్మాళ్వారి। నొకరి నెంబెరుమానారు నొకరిఁ జేర్చి। దినము నారాధనముఁ జేసి తేరియుందు। రనుచు లక్ష్మణ మునివరుం డానతిచ్చె॥ ౮

తా॥ ఈపదుగురాళ్వారులును నేక కంఠులై సర్వేశ్వరుం డిచ్చిన జ్ఞానసిద్ధి సంపన్నులై యొకరుగా నుండురనియు నిందులోన నమ్మాళ్వారికి నవయవ పరతంత్రులనియుఁ దక్కినవారు శ్రీమధుర కవులును నవయవాదులనియు శ్రీ మధురకవులు శ్రీమన్ నాథమునులకు నాచార్యులైరనియు నీవల శ్రీ యామునాచార్యులు మొదలైన వారికి నమ్మాళ్వారులు నుత్తారకులనియు నెంబెరుమానారు దర్శనోద్ధారకు లనియు నాళ్వారులలోపల నమ్మాళ్వారులును నాచార్యుల లోపల నెంబెరుమానారును నీయిద్దరిని బూర్వులెఱింగి యన్ని తిరుమాళిగలను నమ్మాళ్వారులను నెంబెరుమానారును వేంచేపు చేసి ప్రతిదినమును దిరువారాధన సేతురనియు నిది మెఱింగి తేరియుందురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( నమ్మాళ్వారుల వైభవమును నెంబెరుమానారుల విభవమును నానతిచ్చి శ్రియఃపతి యర్చావతారమైన విభవము మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ దైవమిట్లు ర్చావతారమై నాఁడనక ద్రవ్య బుద్ధిని గోదుఁవఁ ద లఁచునతఁడు । దనుచేత గురుఁడాయెఁ దానె శ్రీ హరియనక మదిలోన నర బుద్ధి మానసతఁడు। నన్నిజాతులయందు నవతరించీశ్వర వైభవం బెఱిఁగించ వచ్చిరనక । శ్రీవైష్ణవుల జాతి చింతించి నిజమాత్మయోని పరిక్షించు హీ నసరులు । చెడుదురని శాస్త్రమందలి చెప్పవినిన । మనుజుఁ డర్చావతారాది మహిమఁ దెలిసి । దాసుఁడై సేవ సేయుమఁ దలఁపులోన। మఱువ వలదనె లక్ష్మణ మౌనివరుఁడు॥ ౯

తా॥ దైవమైన శ్రియఃపతి యర్చావతారమై నాఁడనక ద్రవ్య బుద్ధిని గోదువఁ దలఁచిన యతండును ఆచార్యుని శ్రియఃపతి యనక మనుష్య బుద్ధి మానకయుండిన యతండును సకల జాతులయందును నవతారమై శ్రియః పతి వైభవ మెఱిఁగించ వేంచేసి రనక శ్రీ వైష్ణవజాతులు స్మరించె నామా త్మయోని పరిక్షఁ జేసినా హీనమైన నరుండనియు వీరు మొదలైనవారు చె డుదురని శాస్త్రము చెప్పుచున్నది గనుక యిది యెఱింగిన మనుష్యుఁడు అ ర్చావతారాది మహిమఁ దెలిసి దాసులకు దాసుండై సేవఁ జేయుచును దలంపు లోపల మఱువ వలదని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ ( అర్చావతార పరి భవము కారాదనియానతిచ్చి తెలిసినవారు విష్ణుమాయఁగడచెదు నుపాయము మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ ఆ బ్రహ్మకును దురత్యయమైన దేవుని మాయఁ గడువను మంచి మందుగలదు । చెప్పెదమును మీరుచేసిన పుణ్యపాపతుయార్థమం లోక భర్త యైన । దేవుఁ డచ్యుతుఁడని తెలిసి యాతనిమాయ సంసారమని హరి శరణు చొచ్చి । మఱి పుణ్యపాపముల్ మహిలోనఁ జేయక తద్దీయాను వర్తనము గలిగి । యుంపు డిందుకు మీరు దా నోపకున్న । భూమిలోపలఁ జచ్చుచుఁ బుట్టుచుండ । నేల జనులార యతిరాజు నెరింగి పాడి । యానఁడని చెప్పె లక్ష్మణాచార్యవరుఁడు॥ ౧౦

తా॥ బ్రహ్మాదులకుఁ గడచిపోఁ గూడని విష్ణుమాయఁగడువ మంచి మం దుగలదని చెప్పుచున్నారము మీరు పూర్వముచేసిన పుణ్యపాపములు నాశన మగుటకు సకలాత్మలకు భర్తయైన దేవుఁ డచ్యుతుఁడని తెలిసి యతని మా య సంసారమని యాతనికి శరణుచొచ్చిన నామాయ తొలఁగి పోవుననియు మఱి వెనుక పుణ్యపాపములు సేయక శ్రీవైష్ణవ సాహవాసము గలిగియుండు డనియు . నిందుకు మీరోపలేకుండితిరేని భూమిలోఁ జచ్చుచుఁ బుట్టుచుండనేల

జనులారా యతిరాజుల నెఱిఁగి పాడి యాడుఁడని లక్ష్మణార్యులానతిచ్చిరి॥
(శ్రియఃపతి మాయ యనెడి సంసారము నివారణమయ్యెడు నా విధమానతి
చ్చి శ్రీవైష్ణవ లక్షణముమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ శ్రీవైష్ణవులఁ గూడి శ్రీవైష్ణవుండయ్యు నేను నా దను మాట
మానకున్న । నడిమెడ దాసుఁడ నపరాధిననకున్న విని కన్నచోట సేవించకు
న్న । జాత్యాదులేచూచి సత్కరించకయున్న సుద్ధతోక్తులకుఁ దా నోర్వకు
న్నఁ । దద్గతాభాస పాతకము గప్పకయున్నఁ దనదుర్గుణము చాఁచి దడవకు
న్నఁ । దత్పాదాదుల తీర్థంబు త్రావకున్నఁ । దత్సపావన భోగాంశఁ దగు
లకున్న । సాక్షి నారాయణుండె వైష్ణవుఁడు కాఁడు । తేరకాడనె
లక్ష్మణ దేశికుండు॥ ౧౧

తా॥ శ్రీవైష్ణవులతోఁడ శ్రీవైష్ణవుండు కూడెనేని నేను నాది యనుమాట
మానవలె ననియు శ్రీవైష్ణవులఁ గన్నప్పుడడిమెడ దాసుఁడ నపరాధినన
కున్నన శ్రీవైష్ణవుల మహిమలు విని కనినయప్పుడే సేవించనప్పటికిని ఆ శ్రీవై
ష్ణవజాతులును వారి కొదువలును జూడరాదనియు ఆ శ్రీవైష్ణవుల కోపమునకు
నోర్వవలె ననియు శ్రీవైష్ణవుల యందుఁ గొదవలుచూచి దుర్భాషలాడక
కప్పుకొని యుండవలెననియు అట్టి శ్రీవైష్ణవులైన పెద్దలయందుఁ దన విశే
షగుణములు దాఁచవలె ననియు ఆ శ్రీవైష్ణవుల శ్రీపాద తీర్థంబు ప్రసా
పడక యుండి నను ఆ శ్రీవైష్ణవ పావనమైన భోజ్యములఁ దగలకయుండినను
సాక్షి నారాయణుఁడె యట్టి వారు శ్రీవైష్ణవులే కారని లక్ష్మణార్యులా
నతిచ్చిరి॥ (శ్రీవైష్ణవుల వైభవను లానతిచ్చి కర్మజ్ఞాన భక్తుల విధములు
మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ అందలంబును మోయు నత నందు రాజుకుఁ గల కృపకర్మనిష్ఠం
దుఁ గలదు హరికి । మంత్ర యోగ్యుండైన మంత్రియందుఁగల కృపజ్ఞాన ని
ష్ఠునియందు శౌరికుండు । వెలయాలియందునువృత్తిఁ జేసెడి కృప భక్తిని
ష్ఠునియందుఁ బరఁగుచుండు । నతిసాధ్వియైన యిల్లాలందుఁగల కృప సన్న్యస్తభ
రునందు స్వామికుండు । ననివివేకించి మదిని మహాత్ములరసి । కర్మయోగా
దినిష్ఠాప్రకార మెఱిఁగి । మాని యాత్మేశ్వరుండగు మాధవునికి । నాత్మన
ర్పింతురని లక్ష్మణార్యులనిరి॥ ౧౨

తా॥ అందలము మోఁచెడు బెస్తలయందు రాజుకుఁగల కృపకర్మనిష్ఠ
చేతఁగడవెళ్ళ వలెనను వారియందు శ్రియఃపతికి గృప గలదనియు మంత్రి

లోచనము చేసెడు మంత్రియందు రాజునకుఁగల కృతజ్ఞానముచేతఁ గడవెళ్ళ వలెనను వారియందు శ్రియఃపతి కృపగలదనియు విటునికి వేశ్యయందెంత దయగలదో భక్తిచేతఁ గడవెళ్ళవలెనను వారియందు శ్రియఃపతికి నాదయగల దనియు పతివ్రతయైన స్త్రీయందుఁ బురుషునికె నెంతదయగలదో ప్రపత్తిచేతఁ గడవెళ్ళవలెననెడు వారియందు శ్రియఃపతికి నంతకృపకలదనియు అని వివేకంచి యామహాత్ములైనవారు మనస్సు పారఁజూచి కర్మయోగాదుల నిష్ఠాప్రకారమెఱిగి యవిమాని యాత్మకుఁ గర్తయైన శ్రియఃపతికిఁ దనయాత్మ సమర్పణముగాఁ బ్రపత్తిసేయుదురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (కర్మయోగాదులయధికారము లానతిచ్చి ప్రపత్తిపరుడై శ్రీవైష్ణవులఁగూడి వారికిఁ బ్రియముఁ జేయుట మంచిదని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ తనకు దుశ్శకసాధ్య ధర్మజాలము కన్న నచ్యుత సిద్ధధర్మాశ మేలు। అల్పాస్థిరస్వార్జితైశ్వర్యములకన్న నచ్యుతదత్త భోగాశమేలు। తనకిష్టముగఁ జేయు తద్దాస్యమునకన్న నచ్యుతేష్ట స్వాత్మహాని మేలు। అచ్యుత ప్రీతితా నరసి చేసుటకన్న శ్రీవైష్ణవప్రీతిఁ జేయమేలు। అఖిల శ్రీవైష్ణవులకుఁ దాననవరతము। ప్రీతిఁ జేసెడువాఁడైన పృథివిలోన। రమ్యగుణజాలుయతి కులరాజుఁ జేరి। యుండవలెనని లక్ష్మణయోగివరుఁడు॥ ౧౩

తా॥ తనకు సాధ్యముగాని ధర్మజాలము కన్న సిద్ధధర్మమందాశ మేలనియు అల్పమునై యస్థిరమునైన తా నార్జించిన యయిశ్వర్యమునకన్నను శ్రీవైష్ణవులతో సహవాసము గావలెననియెడు నాశమేలనియు తనకు నిష్టమైన దాస్యము చేసుట కన్నను శ్రియఃపతి యిష్టమెఱిఁగి దాస్యముచేసి యాత్మను సమర్పించుట మేలనియు అతని కిష్టము చేసుటకంటె శ్రీవైష్ణవులకుఁ బ్రియము చేయుట మేలనియు అటువలె సర్వమైన వైష్ణవులకు సంతోషము చేసెడువాఁడైనను నిబ్భూమిలోనఁ గల్యాణగుణములు గలిగిన యెంబెరుమానారును జేరియుండవలెనని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (అఖిల వైష్ణవుల సంతోషింపఁ జేయవలెనని యానతిచ్చి శ్రియఃపతి కైంకర్యమే యని యున్నవారికి సాధనాంతర పరులతోడి సహవాసము కారాదని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ నాదినేనను వారి ననమేయమను వారి దేవతాంతరము నుతించు వారి। సాధనాంతరనిష్ఠ సాధింతుమనువారి సుగతికై హరి శరణుఁ జొచ్చు వారి। నెఱిఁగి కూడకదగిన దీశ్వర కైంకర్య మనియును దదుపాయ మతని

కరుణ । యనియును శాస్త్రార్థమరసి లక్ష్మీశ్వర ప్రపదనిష్ఠులై పరములైన వారి కరుణకు విషయమై వారి దాస్య । మాత్మ కరణ త్రయంబున నమరిదినము । చేయు చుండెడివారి కేచింత లేదు । ముక్తసములనె లక్ష్మణ మునివరుండు॥ ౧౪

తా॥ నాది సేనను వారిని శ్రియఃపతిని సరూపముగాఁ జెప్పెడి వారిని దేవతాంతరముల నుతించెడు వారిని సాధనాంతరముల సాధించు మను వారిని మోక్షము కొఱకు శ్రియఃపతిని శరణుఁ బొందెడి వారిని వీరల నెఱిఁగనేని వారలఁగూడ వలదనియు తనకుఁ దగినది సర్వేశ్వరుని కైంకర్యమే యనియు నందుకు నుపాయ మతని కృపయే యనియు శాస్త్ర సారము లెఱిఁగి ప్రపత్తి నిష్ఠాపరులైన వారి కృపకుఁ గావలసిన దాస్యము అయాత్మ కరణ త్రయంబున నమరికఁ జేసెడి వారికి నీ చింత లేదు ముక్తసములని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ ( సాధనాంతర పరులను గూడ రాదని యానతిచ్చి తాత్పర్య నిర్ణయమునై యనుభవ మైన యర్థమును నిర్ణయించి మీఁద నానతిచ్చుచున్నారు॥ )

సీ॥ శ్రీశాధిక ప్రాప్య సేవ్య వస్తువు లేదు తద్దాస్య సమ ఫలోదయము లేదు । తన్మంత్ర రత్న ప్రదాచార్యునకు సరి రక్షకత్వోప కారకుఁడు లేఁడు । తద్భక్త సదృశ తీర్థము జగతిని లేదు తదపచారాస్య పాతకము లేదు । తద్గుణ జ్ఞానసందర్శనంబుల కెక్కుడైన సుఖం బిందునందు లేదు । తద్వయోక్తికిఁ దుల్య మంత్రమును లేదు । తదితరాప్రీతి కన్నను ధనము లేదు । తత్త్వ శౌర్యంబు కన్న శాస్త్రము లేదు । తెలియుఁడని చెప్పె లక్ష్మణ దేశికుండు॥ ౧౫

తా॥ తాను సేవించుటకు శ్రియఃపతి కన్న నధిక వస్తువు లేదనియు అతని దాస్యమునకు సమమైన ఫలము లేదనియు మంత్రరత్నము ప్రసాదించిన యాచార్యునికి సరి రక్షించెడు నుపకారకుఁడు లేఁడనియు అతని దాసుల శ్రీపాదతీర్థమునకు సరిమఱితీర్థము జగతిని లేదనియు వారియపచారమునకు సరిమఱియపచారము లేదనియు వారికల్యాణగుణముల వలనను వారినిఁజూచి నందువలనను వచ్చెడి సుఖమిందును నందును లేదనియు ద్వయమునకు సరిమంత్రము లేదనియు ఇతరమైన క్షుద్రమంత్రము లందును నాప్రీతికన్నను ధనము లేదనియు దచ్ఛేషమయిన తన్నుఁ దానపహరించుట వారివిరోధుల పట్లను వైరాగ్యమునకన్నను శత్రుత్వము లేదనియు నీ నిర్ణయములు తెలియుండని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (అనుభవ నిర్ణయముల నేర్పాటుగా నానతిచ్చి బంధమోక్షములను

వివరణముగా క్రింద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ దేహ విశిష్టాత్మ దృష్టి చెప్పుచు నన్న యాశాస్త్ర ఫలము దే హంబుచేత । నిషకృష్ట వేషంబు నిశ్చయించెడి మంత్ర మందలి ఫలము జీ వాత్మచేత । సర్వంబు విడిచి శ్రీయాశ్వరుని బట్టుమటన్న చరమోక్తి ఫలమునీ శ్వరునిచేత । స్వకృతపాతకభీత శరణాగతా భయ కారణద్వయ ఫలము క మలచేత । ననుచు శాస్త్రంబులందు రహస్యమైన । మూఁటి యభిసంధియును బంధమోక్షములకు । జెప్పు నాచార్య కృపనమ్మి చింతమాని । యుండవ లెనని లక్ష్మణయోగివరుఁడు॥ ౧౬

తా॥ దేహమునకు కర్తమైన యాత్మను బూడఁజేసెడు శాస్త్ర ఫలము దేహముచేత ననియు కొందువజాతి వేషములను నిశ్చయించెడి మంత్ర మందలి ఫలము జీవాత్మచేత ననియు సర్వమును విడిచి శ్రియఃపతిని బట్టుమన్న చరమ మైన ఫలము శ్రియఃపతి చేతననియు తాను జేసిన సర్వాపరాధములకును శర ణాగతులైన వారికిఁ గారణమైన యభయము పెరియ పిరాట్టిచేత ననియు అని తిరుమంత్రద్వయ చరమశ్లోకముల నిర్ణయముల నెఱిఁగి కట్టుబడ్డ బంధముల ను బోగొట్టుకనియు నీయర్థమానతిచ్చి యాచార్య కృపనమ్మి విచారములు వి డిచి యుండవలెనని లక్ష్మణాచార్యులానతిచ్చిరి॥ (రహస్యత్రయ నిర్ణయముల నా నతిచ్చినతరువాతనె రవారిలక్షణములమీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ రక్షకో పాయాంతరముల నెఱుఁగక హితంబడిగిన వాఁడె మోక్షాధికారి । స్వఖ్యాతిలాభ పూజాను వర్తనములయందాశ మానిన యు తండె గురుఁడు । దోషభూయిస్త్వ సద్గుణ హీనులరయక రక్షించువాఁడెఁధర ణేనిదైవ । యొకమాటు నుడివిన నుత్తమోత్తమమైన మహిమనిచ్చెడు నది యె మంత్రరత్న । మాత్మకిహపాను రూపమైనదియె ఫలము । తెలిసికృపఁజే యువారె తదీయులగుచు । బహువిధంబుల జనహిత పరులగుచు గానఁ । దె లియఁజెప్పను లక్ష్మణదేశికుండు॥ ౧౭

తా॥ సర్వమైన యుపాయాంతరములు లెస్సవిడిచి రోసియాత్మకుహి తవడిగినవాఁడె మోక్షాధి కారియనియు ఖ్యాతిలాభ పూజలయం దాశ మానిన యతండె యాచార్యుండనియు అధికమైన దోషములను హీనులని చూడక రక్షించువాఁడె దైవమనియు నొకమాటు నుచ్చరించిన నుత్తమ మైన మహిమనిచ్చిన యదియే మంత్రరత్నమనియు ఆత్మకు ననురూపమై నవృత్తి ఫలమనియు నీలాగునఁ దెలిసి కృపఁజేసెడి వారు శ్రీవైష్ణవులని

యు బహువిధములుగా సర్వ జనులకును హితపరుఁడుగాఁ దెలియఁ జేసిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఇటువలె స్వరూపస్వభావము తెలిసిగి శేషత్వ పారతంత్ర్యము గలిగి యుండవలెనని యానతిచ్చి యీ వివరము లానతిచ్చువారరుదని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ దేహేంద్రియ ప్రాణ ధీ వ్యతిరిక్తుఁడై యాత్మ యొకఁడె కలండనెడి దరుదు। అతని విజ్ఞానమయత్వ విజ్ఞాతృత్వ నిత్యత్వములఁ జెప్ప నేర్చుటరుదు। అతఁడన్ని దేహంబులందును భిన్నమై హరి శేషమై యుండుననెడి దరుదు। ఈ క్రమం బెల్లను నెఱిఁగి తదీయుల కితఁడు శేషంబని యెఱుఁగుటరుదు। అదియు నెఱిఁగియు నెఱుఁగనియట్లు దాను। వైష్ణవుల కెల్ల దాసుఁడై నారిదాస్య। మధికఫలమని యుండిన యతఁడె ఘనుఁడు। ముక్తసముఁడనె లక్ష్మణ మునివరుండు॥ ౧౮

తా॥ దేహేంద్రియములు ప్రాణములు బుద్ధి వీనికి నాత్మ యొకఁడె కూడక వేఱై యుండుననుననది యరుదనియు నా శ్రియఃపతియొక్క సర్వజ్ఞత్వమును నతని సర్వవిధ పోషకత్వమును నతని నిత్యత్వమును జెప్ప నేర్చుట యరుదనియు నతఁడన్ని దేహంబులందును భిన్నమై యంతర్యామియై సర్వాత్మలును నతనికి శేషమై యుండుననునది యరుదనియు నీక్రమమెల్ల నెఱిఁగి తాను శ్రీవైష్ణవులకు శేషమని యెఱుఁగుట యరుదనియు నివి యన్నియు నెఱిఁగియు నెఱుఁగనియట్ల శ్రీవైష్ణవులకెల్ల దాసుండై హరిదాస్య మధికఫలమనిన యతఁడె ఘనుఁడనియు నతఁడు ముక్తులకు సమానుఁడని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఈ యుపర్యుక్తులైన తాత్పర్యాధికారుల నానతిచ్చి వారికిఁ దగిన యధిక ఫలాదులను మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ భగవత్పర్వతాది పంచ స్థలంబుల కన్న నాచార్యత్వ మధికమనియు। స్వజ్ఞత్వ విష్ణుశేషత్వాకృతులకన్న హరిదాస శేషత్వ మధికమనియు। నైశ్వర్య కైవల్య హరిపదంబులకన్న నాతదీయుల దాస్యమధికమనియు। సత్కర్మయోగాది సాధనంబుల కన్న నాచార్య సంబంధ మధికమనియు। మఱి విరోధులు తన యహమ్మమత లనియు। నెఱిఁగి భాగవతాచార్య హృదయములకుఁ గలత లేకుండ మెలఁగి తత్కరుణ వడసి। యుండవలెనని లక్ష్మణ యోగివరుఁడు॥ ౧౯

తా॥ శ్రియఃపతియొక్క పరవ్యూహ విభవాంతర్యామి త్వార్చావతారంబుల కన్నను నాచార్యత్వ మధిక మనియుఁ దన యెఱుకచేత శ్రియఃపతికి

శేషత్వాదు లాచరించుట కన్నను శ్రీవైష్ణవులకు శేషపడ్డనది యధికమనియు నయిశ్వర్య పరమపదముల కన్నను నా శ్రీవైష్ణవుల దాస్యమధికమనియు కర్మ యోగాది సాధనాంతరములకంటె నాచార్య సంబంధ మధికమనియుఁ దనకు విరోధు లహమ్మమతలనియును నిది యెఱిఁగి భాగవతాచార్య హృదయముల కుఁ గలత లేకుండ మెలఁగి వారికృపతనకుఁ గలుగునట్లుండవలెనని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥ (ఆచార్యభాగవతవైభవములకు వెరచి మెలఁగవలెనని యానతిచ్చి యాచార్యుని వైభవము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ సార్వభౌమునికిఁ దా జన్మించి బడి వాసి బెస్తవానింటిలోఁ బె
రుగుచుండ । ధార్మికుం డెఱిఁగించి తండ్రిలోఁ గూర్చిన నిద్దరి సంబంధ మెఱిఁ
గినట్లు । తాము నన్న పరమాత్మ దాసుఁడై ప్రాకృత దేహంబులోఁ జొచ్చి
తెలియకున్న । నాచార్యుఁ డెఱిఁగించి యా యిద్దరిని గూర్చ నన్యోన్యమై
యుండురగుటఁ జేసి ।' తాము కలికాల మతని కృతఘ్నులగుచు మనసు । లోపల
నాచార్యు మఱువకుందు । రాత్మపరమాత్మలని తామె యానతిచ్చి । రాయ
తీశ్వరులని లక్ష్మణార్యులనిరి॥ ౨౦

తా॥ సమస్త భూమిని నేలెడు చక్రవర్తియైన రాజుకు జన్మించి బెస్తవానింటిలోఁ బెరుగఁగా ధార్మికుఁడైన యాచార్యుఁడు కన్న తండ్రి మహిమ యేకాంతమున నానతిచ్చి యార్తి పుట్టిన వెనుక యాతండ్రికిఁ దామె యానతిచ్చి కుమారునిఁ దండ్రినిఁ గూర్చినట్లు తాను మును పరమాత్మ దాసుండై యుండియుఁ బ్రకృతి దేహంబునఁ జొచ్చి తుదమొదలు తెలియకుండఁగా నాచార్యుం డెఱిఁగించి యా యిద్దరిని గూర్చిన నన్యోన్యులై కూడుకొని తమ తమ మనస్సున నెప్పుడును నాచార్యుని మఱువక యాత్మ పరమాత్మలఁ దలంచుచుందురని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (ఆచార్య వైభవమును నాత్మ పరమాత్మోపకార స్మృతిని నానతిచ్చి శ్రీభట్టరు సేతువును వేంచేసిన విధము మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ ॥ శ్రీభట్ట రటతొల్లి సేతు దర్శన కాంక్షఁ బోవుచోఁ దెరువున
బోయపల్లె । లోపల నొకనింటిలో నిల్చి యాతని వనములో నేఁటి నీవ ర్తమా
న । మేమని యడిగిన నెకిఁడ నేమియు దొరకకనే మా నీతోఁ బలోన । మునిఁగి
యుండిన కొండముచ్చు పిల్లను గొంచురాఁ జూచి తల్లి పరాకులేక । వెంట
నేతెంచి మొఱకిన విడిచివచ్చి । తనినభట్టరు వీఁడె యుక్లైన చోట । నేమినే

యుండు హరియని యాడంబడియె । ననుచు లక్ష్మణమునివరుం డానతిచ్చు॥ ౨౧

తా॥ శ్రీభట్టరు తొల్లి సేతువుకు వెంచేయుచుఁ దెరువున బోయపల్లె లోన నిలిచితనియు నాపల్లెలో నొకని గృహంబున నిలిచి యా మందిరమున నున్నబోయం జేరం బిలిచి యీయడవిలో నేఁటి నీవ ర్తమానమేమనియడుగఁ గా నతండీయరణ్యంబున కేను వేఁట కేగిన నెందేమియు దొరకమింజేసి యొక ప్రాణితోఁ బిలోనున్న కొండముచ్చుపిల్లను బట్టుక రాఁగా నాపిల్లతల్లి పరాకు లేకవచ్చి మ్రొక్కిన నేనాపిల్లను విడిచివచ్చితినని విన్నపముచేయ నప్పుడు శ్రీ భట్టరువిని యాశ్చర్యమంది వీఁడే యీలాగున నుండఁగా నింక శ్రియఃపతి శర ణాగతులనేమి సేయుండని యీడుపడిరని లక్ష్మణార్యులానతిచ్చిరి॥ (శ్రియః పతికి శ్రీ భట్టరీడుపడిరని యానతిచ్చి యీచేతనుం డుపాయాంతరముల నుండ రాదని మీఁద నానతిచ్చుచున్నారు॥)

సీ॥ చిరదు స్వతంత్రత చెడిన యప్పుడె కల్గు హరికి దా శేషమైనట్టి తలంపు । చైతన్యకార్య స్వగం రక్షణేచ్ఛయుఁ జెడిన యప్పుడె సత్వచింత గల్గు । బృథగవస్థితిచేత భేదంబుచెడినట్టి స్వస్వాములకునైక్య సరణిచెలియు । కరణిఁ గరణస్వప్రకారంబు తెలిసినఁ దన ప్రవృత్త్యాదులాతనివె యవును । నను చుఁ దెలిసినవారికి హరికిభోగ । మేకమైయుండు నితరేతరేచ్ఛఁజేసి । తప్పదిది సుమ్మి వేద తాత్పర్యమనుచుఁ । దెలుపు నొకవేళ లక్ష్మణ దేశికుండు॥ ౨౨

తా॥ తనస్వతంత్రము చెడినప్పటికిఁగదా శ్రియఃపతికిఁ దాను శేషమైనట్టి తలంపు సిద్ధమనియు చైతన్యకార్యము దనకుఁ దాను రక్షించుకొనెడు బుద్ధిమా నినఁదనలో నుండెడు నాత్మకుఁ జింత గలుగదనియు హెచ్చుతకుహవలు చూడ కుండి నప్పుడు తన స్వాములని శ్రీవైష్ణవులకు నైక్యమైన త్రోవఁ దెలియును ననియు నిటువలెఁ దనమనస్సుయొక్క ప్రకారంబు తెలిసినఁ దనప్రవృత్తు లతనివే యవుననియు ననుచుఁ దెలిసిన వారికిని శ్రియఃపతికిని భోగ మేకముగా నుండు ననియు నన్ని కార్యములును నతని యిచ్ఛచేతనే యని నిర్ణయించియు నిదియె వేద తాత్పర్యమని లక్ష్మణార్యులానతిచ్చిరి॥

గద్య॥ ఇది శ్రీముముక్షుజనకల్పకంబను మహాప్రబంధంబునందు హృదయ సంగమంబైన గురుపరంపరకు ముక్తాహార సామ్యంబుఁ జెప్పుచు యతీంద్రుని నాయకమణిగాఁ దనుభయపార్శ్వాంత రాంతరస్థిత ప్రధాన దేశికులు దన్మ ధ్య నాయకరత్నోభయపార్శ్వస్థిత మణి స్థానీయులుగాఁ గడమ దేశికులు ముక్తాస్థానీయులుగావర్ణించుటయును నేతదనుసంధానవిశిష్టాధికారికి సహావా

సయోగ్య వర్ణనంబును నుపకారకత్వేన ప్రధానదేశికా వశ్య భజనీయత్వం బును దద్దేశిక పంచకమునకుఁ బ్రాప్యతయాపరమ భోగ్యత్వంబును దత్ప్రధాన దేశికసహితస్వాచార్యుని స్వహృదయ స్థితికై ప్రార్థించుటయును తత్ప్రార్థన ప్రకారంబును స్వస్థానహృదయ దోష నివృత్తి పూర్వకంబుగా స్వాచార్యుం డు నిలుచుటంజేసి నిర్భరత్వాను సంధానంబును గురుపరంపరనాయక మణి భూతయతీంద్ర వైభవజ్ఞాన దేశిక వర్ణనంబును ఆళ్వారులకు నాచార్యులకుఁ బ్రధానులగు శఠారియతీంద్రులనే శ్రీవైష్ణవులు కొలిచెడి ప్రకారంబును భ గవ ద్భాగవతాచార్యుల కొదువ లెంచక తనకు స్వాములని మఱువకుండ వ లెననియును భగవన్నామముఁ గడచెడు ప్రకారంబును శ్రీవైష్ణవులలోఁ గలసి యుండెడి ప్రకారంబును గర్మజ్ఞానభక్తి ప్రపత్తినిష్ఠులయందు సర్వేశ్వరుని కిఁ గల కృపాతారతమ్యంబును యతీంద్రాను వర్తనమే సర్వఫలసిద్ధియనియు ను సహవాసయోగ్యులు గాని వారినీ సేయుఁగ వలెననియును సర్థపంచకతత్వ సారంబు బహు ప్రకారంబుల వర్ణించుటయును ఆత్మేశ్వర సంబంధ జ్ఞానమే ప్రధానమనియును భగవన్నమస్కారం బమోఘంబనియును తిరుమంత్రార్థ విరోధులు పోయిన ప్రకాశించెడి ప్రకారంబునన్నది చతుర్థ ప్రకరణము॥



శ్రీమతేరామానుజాయనమః.

ము ము క్షు జ న క ల్ప క ము.

పంచమ ప్రకరణము.



గురుపరంపర వైభవనిర్ణయముల నానతిచ్చి యెంబెరుమానారు వైభవ మునీంద నానతిచ్చుచున్నారు॥

సీ॥ రామానుజశ్రీశ రక్షార్థినే భవద్భవతే స్వహం శివం పావనా య । భాష్యకారాస్తుతుభ్యం శుభమ్మాధవశాశ్వత మంగళాశాసనాయ । భద్రంయతీంద్రతే భవతు లక్ష్మీనాథ కైంకర్య సామ్రాజ్య కామనాయ । భూతపురాధ్యక్షు భూయాసురార్జిత మంగళానిభవన్ని మజ్జనాయ । శశ్వదీ ప్సితకృతభావ చ్ఛాసనాయ । మాదృశాకించనావనమానసాయ । కూరకురు కేశ్వరాది సద్గురువరాయ । లక్ష్మణాచార్యమానస లక్షితాయ॥ ౧